# అమృతాంజన్‌కే తెలుసు ఒంటి నొప్పులు

అమృతాంజన్‌తో మీరు నిజంగా నొప్పులు బాధలు మర్చిపోవేస్తున్నారు. నాలుగుసార్లు గట్టిగా తడిమితేచాలు మీ నొప్పులు అప్పుడే తగ్గుముఖం పట్టేస్తాయి.

ఘాటైన ఇతర మందులలాగకాక బాధ వుండేచోట అమృతాంజన్ పై చర్యవల్ల అతిశీఘ్రంగా గుణం ఇట్టే కనిపిస్తుంది. శక్తివంతమైన 10 ఔషధాలు చేరిన మందు ఏ యితర బాధలను కలిగించదు.

85 సంవత్సరాల పైబడిన ప్రసిద్ధి గల అమృతాంజన్ బెణుకులు, తల నొప్పి మరియు జలుబులకుకూడా బాగా పనిచేసి అమోఘంగా నివారిస్తుంది.

ఈ బాధలు చెప్పిరావు. అనుకోకుండా వస్తాంటాయి. అందుకే చేతికి అందుబాటుగా అమృతాంజన్ వుంచుకోడం మంచిది. ఎప్పుడు అవసరమవుతుందో మీకసలు తెలియదు.




## అమృతాంజన్

శీఘ్ర నివారిణి. నమ్మకమైనది. ఏ ఇతర బాధనూ కలుగచేయదు.

OBM 7656 TG

విమల్‌వారి విశిష్ట ఉత్పాదన

# ఎస్‌క్లూజివ్ సూట్‌లెంగ్త్స్

సూటింగ్సులో ఎన్నో ఉన్నత
ప్రమాణాలు నెలకొల్పిన విమల్
సూటింగ్సువారి అసామాన్య సృష్టి.




మంగళ్‌దీప్

కోఠీ, హైదరాబాద్, ఫోన్: 45786
ఆంధ్ర ప్రదేష్‌లో అన్నిటికన్నా పెద్దదైన విమల్ షోరూం



® is the registered trademark of Reliance Textile Industries Ltd.

Mudra/RTI/917 TEL



## ముఖచిత్రం

22-4-83 ఆంధ్ర సచిత్ర వారపత్రిక "ఉగాది ఊహలు" శంకుగారి కలంనుండి వెలువడిన ముఖచిత్రం అందమైన రంగుల్లో ఆకర్షణీయత తొణికిసలాడింది. ఈ సంచికలో ప్రచురించిన "నీడ-క్రీనీడ" విహారిగారి కథ పత్రికకే తల మానికం అనిపించింది.

పి. ఉమామోహన్, ఆశాజ్యోతి (కాశీబుగ్గ)

* * *

15-4-83 తేదీ ఆంధ్రసచిత్ర వారపత్రిక ముఖచిత్రం బాగున్నది. ఈమధ్య కాలములో ముఖ చిత్రంపై మీరు ప్రాధాన్యత ఇవ్వడములేదు. కావున శ్రద్ధతో మంచి ఆకర్షణీయమైన ముఖచిత్రములు ప్రచురించవలసినదిగా కోరడమైనది.

కె. నారాయణ (తాడిపత్రి)

## తెగిన పేగు

అప్పుడప్పుడు నేను ఎప్పుడో విడిపోయిన నా బాల్యస్నేహితుల నందరినీ కలసి ఎవరెవరు ఎలా వున్నారో చూస్తే బాగుండునని అనుకుంటాను. నిజంగా అలా జరిగితే ఆ అనుభూతి ఎలా వుంటుందో మీరు ప్రచురించిన 'తెగిన పేగు' కథ ద్వారా తెలుసుకున్నాను.

శ్రీమతి పరాగిత్ (రాయచోటి)

## సీరియల్స్

సులక్షణ ముఖచిత్రం ఆంధ్ర సచిత్ర వార పత్రికకు సరిక్రొత్త అందాలను చేకూర్చినది. "జీవిత సమరం" సీరియల్ ఈ వారం చదివి మా కళ్ళు చెమర్చాయి. కేవలం డబ్బు, నగలకోసం తనను నమ్మి వచ్చిన అమ్మాయిని బాబ్జిలాంటి భర్తలు, సుబ్బాయమ్మలాంటి అత్తలు అమానుషంగా చిత్రవధ చేసి చంపడం ఈనాడు సంఘంలో జరుగుతున్నవే. నీరజ దగాచేసే మగవాడు తన మగడైనాసరే వానిని చంపటం నవలకు క్రొత్త మలుపును, సరికొత్త వూపును ఇచ్చింది. 'అందానికి అవతలివైపు"లో సుందరి శ్యామలరావ్‌లకు వివాహం కావటం ఆ నవలలోని 'థ్రిల్'ను 'డల్' చేసింది.

వై. చంద్రశేఖరరెడ్డి (నగరి)

* * *

మీరు ప్రచురిస్తున్న యర్రగుంట్ల వరలక్ష్మి దేవి సీరియల్ నవల "జీవిత సమరం" సమకాలీన సమాజ స్థితిగతులను ప్రతిబింబిస్తూంది. దేశంలో డవురీ డెత్స్ రోజు రోజుకూ మితిమీరిపోతున్న ఈ తరుణంలో ఇటువంటి నవల ప్రచురించడం ఎంతైనా హర్షదాయకం. ఈ హింసాకాండను రూపుమాప డానికి ఎన్ని చట్టాలు చేసినా లాభం వుండదు. మానసిక పరివర్తన ఒక్కటే దీనికి మార్గం. అందుకు ఇలాంటి నవలలు ఎంతైనా ఉపయోగకరం.

– ఆవుల రమణారెడ్డి, సిండికేట్ బ్యాంకు (జమ్మలమడుగు)

## వ్యాసం

8-4-83 సంచికలో "ప్రేతాత్మలతో వైర్‌లెస్ సంబంధాలు!" వ్యాసం మాకెంతగానో నచ్చింది. తరచూ ఇలాంటి వ్యాసాలు ప్రచురించ గలరు.

వై. చంద్రశేఖరరెడ్డి (నగరి) ★

**ఆంధ్రసచిత్రవారపత్రిక**

వ్యవస్థాపకులు :
**దేశోద్ధారక కాశీనాథుని**
**వాగేశ్వరరావు పంతులుగారు**
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు :
[1938–1972]
శుక్రవారం : 6–5–'83
రుధిరోద్గారి నామ సం. చైత్ర బ. నవమి
**సంపుటము 75 సంచిక 36**
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

| | | |
|---|---|---|
| విడి ప్రతి వెల | రు. | 1-50 |
| ఆరు మాసాల చందా | రు. | 42 90 |
| పోస్టులో ఏడాది చందా | రు. | 85 80 |

**ఆంధ్రపత్రిక కార్యాలయము,**
గాంధీనగరం. విజయవాడ-520 003.

## విషయానుక్రమణిక






## లోకం పోకడ ✱ బొమ్మన్












# అన్వేషణ జరుగుతోంది



న్యూఢిల్లీ లేఖ

డా॥ జయదుబాషీ

ఒకప్పుడు "నెహ్రూ తరువాత ఎవరు ?" అనడిగే వాళ్ళు, ఇప్పుడు "ఇందిరాగాంధి తరువాత అరాచకమా ?" అని అడుగుతున్నారు. ఎవరీ అడిగే వాళ్ళు ? కొన్ని విదేశీ పత్రికలవాళ్ళే. వాళ్ళకి భారత దేశం భవిష్యత్తుని గురించి ఇంత ఆదుర్దా ఎందుకో! అసలు నిజానికి భారతదేశం భవిష్యత్తు బాగాలేదన్న బాధకాదు ఇలాంటివాళ్ళది. భారతదేశం సంగతి అయిపోయిందన్న సంబరం వాళ్ళది. ఒక పళ్ళూడిన ముసలి పులి అడవిలోని ఊబిలో చిక్కుకుని అవస్థ పడుతున్న ఒక ముసలి ఏనుగుని చూచి లొట్టలు వెయ్యటం అన్నమాట, ఇదంతా.

ఈ రకం వార్తాపత్రికల వాళ్ళకి దుర్వార్త చెప్పపోతున్నాను నేను. భారతదేశం ఊబిలో చిక్కుకున్న ఏనుగ కానేకాదు. నెహ్రూ పోయిన తరువాత ఈ దేశం బాగానే ఉంది. శ్రీమతి గాంధీ అనంతరం కూడా భారతదేశానికి ఏమీకాదు. జరుగుతున్నదేమిటంటే, భారతదేశంలో నెహ్రూ యుగం అంతమవుతోంది, కొత్తయుగం ఒకటి మొదలవబోతోంది. చీకటి తొలగిపోయి సంజ వెలుగు వస్తోంది. కాని, ఇంకా చీకటి పూర్తిగాపోక పాతలో నుంచి వస్తున్న కొత్త మనకి ఇంకా స్పష్టంగా తెలియటంలేదు.

కొందరొక సిద్ధాంతాన్ని తెగ వల్లిస్తూ ఉంటారు. అదేమిటంటే. స్వరాజ్యం వచ్చిన మొదటి 15 సంవత్సరాలూ ప్రజాస్వామ్యం బాగా చెయ్యటానికి కారణం వివిధ రాజకీయ నాయకుల మధ్య సామరస్యం కుదరటానికి నెహ్రూ కారకుడన్న సిద్ధాంతం. నెహ్రూ లేకపోవటంతో ఈ సామరస్యం నశించిపోయి రాజకీయాలలో నిలకడ తగ్గిందిట. మళ్ళా వివిధ రాజకీయ వాదుల మధ్య ఒకరకం అభిప్రాయాలు కొన్ని కుదిరితే కాని — దేశం అనుసరించపోయే విధానాలని గురించి అభిప్రాయాలన్న మాట — ఇలాగే అశాంతి ప్రబలి అస్తిమితంగా ఉంటుందిట.

ఇదొక అర్థంలేని సిద్ధాంతం. నెహ్రూ కాలంలో రాజకీయ నాయకుల మధ్య సామరస్యం ఏమీ ఉండేది కాదు. ఉంటే, అప్పుడే కాంగ్రెసుకి వ్యతిరేకమయిన వోటు అంత ఎందుకు పడేది ? నెహ్రూ పలుకుబడి అధికారం అత్యధికంగా ఉన్నప్పుడే ఆయనకి వ్యతిరేకంగా పడే వోటుల సంఖ్య చాలా ఉండేది. చాలా వరకు ఆయన ప్రభుత్వం మెజారిటీ మీద నడిచిన ప్రభుత్వం కానేకాదు.

దేశమంతటా నెహ్రూ విధానాలపట్ల ఆమోదం ప్రకటించారు, అనటంకన్నా నెహ్రూ అనుసరించిన అభివృద్ధి విధానాలు ఎలాగ పనిచేస్తాయో చూద్దామన్న వైఖరిని ప్రకటించారు అనటం సమంజసంగా ఉంటుంది. నెహ్రూ కుటుంబంవారుచేసిన, చేస్తూ వచ్చిన ప్రచారం ఈ యదార్థాన్ని కప్పిపుచ్చుతూ ఉంటుంది. నెహ్రూ మొదలుపెట్టిన అభివృద్ధి పథకాలని వ్యతిరేకించినవాళ్ళు అప్పుడూ, ఇప్పుడూ కూడా ఉన్నారు.

ఇలాంటివాళ్ళ విమర్శ ఇది— "నెహ్రూ ఆశించినట్లు భారతదేశం మరింత ఉక్కు తయారుచెయ్యవచ్చు, మరింత కరెంటు ఉత్పత్తి చెయ్యవచ్చు, మరింత సిమెంటు తయారుకావచ్చు; కాని, దీనంతటి వల్లా ధనవంతుల—నిరుపేదల మధ్య తేడాలు పెరుగుతాయి, దీనివల్ల సమాజంలోని బలహీనతలు సయితం అధికం అవుతాయి. అంతేకాదు, ప్రభుత్వం — రాజ్యం మరీ బలపడిపోయి ప్రజాస్వామ్యం కోసం కృషి చేస్తున్న ఒకదేశం యొక్క కృషికి భంగం కలుగవచ్చు మరీ బలపడిపోయిన అధికార వర్గంవారు తమ సంయమనాన్ని కోలుపోవచ్చు." ఇంతపనీ జరిగింది. ఇన్ని ప్రణాళికల అనంతరం భారత దేశంలో బీదవారి సంఖ్య ఇంకా అత్యధికంగా ఉంది. ధనవంతుల సంఖ్య కూడా అధికంగానే ఉంది. ప్రభుత్వం, రాజ్యం మరీ బలపడిపోవటం చేతనేకదా నెహ్రూ కుమార్తె సంకోచం లేకుండా నియంతృత్వాన్ని ప్రవేశపెట్టగలిగారు ? నెహ్రూ అనుసరించిన అభివృద్ధి ప్రణాళికల ఫలితంగానే అత్యవసర పరిస్థితి వచ్చింది. అది ఒక వింతా కాదు, ఆయన విధానాల వక్రీకరణమూ కాదు. మాలాంటివాళ్ళు ఎందరో ఇంకా భయపడుతున్నామంటే కారణం ఇదే. అధికారంలో ఉన్నవారు కావలిస్తే మళ్ళీ చెడ్డపని చెయ్యగలరు. వాళ్ళకి కావలిసినవీళ్ళన్నీ ఉండనే ఉన్నాయి. ఆసియాడ్, త. దే. శి. స. (నామ్) వేడుకలు జరిగాయంటే అధికార దుర్వినియోగంకాదూ ?

అత్యవసర పరిస్థితి తరువాత ప్రతిపక్షాలకి ఒక అవకాశం ఇచ్చారు ప్రజలు. ఇంకొక అభివృద్ధి ఉపాయానికి వీలు కలిగించారు. జనతా ప్రభుత్వం నిలబడకపోయిందేమోకాని నెహ్రూ ఉపాయాన్ని వ్యతిరేకించేవాళ్ళు ఇంకా చాలామందే ఉన్నారు. అసలు వీళ్ల ధాటి పెరిగిందనికూడా నేనంటాను. ఢిల్లీలో ఎలాగో గెలిచారుకాని అధికారంలోఉన్న పార్టీ వాళ్ళు ఇంకెక్కడ ఎన్నికలలో మెజారిటీ తెచ్చుకోగలిగారు ? నెహ్రూ ఉపాయం అంటే జనానికి ఎంత ఇష్టం లేదో ఇందిరాగాంధీ ఉపాయం అన్నా (ఆవిడ ఉపాయం అంటూ ఒకటి ఉంటే) అంతే ఇష్టం లేదు జనానికి. వాళ్ల వ్యతిరేకత రోజురోజుకీ బలపడుతోంది.

దీనికొక ఉదాహరణ అంతర్జాతీయ ద్రవ్యనిధి వద్ద భారతదేశం తీసుకున్న అప్పు విషయమయి వెలువడిన నిశిత విమర్శ. రాజకీయపక్షాల ప్రతినిధులే కాదు, అన్ని రకాల జనమూ దీనిని వ్యతిరేకించారు. [రు. 5000 కోట్లు అప్పు తీసుకున్నాము మనం అం. ద్ర. ని. వద్ద.] అప్పటిలో అంత వ్యతిరేకత చెలరేగటం చేతనే కదా ఆ అప్పుని తీసుకువచ్చిన ఆర్. వెంకటరామన్‌ని ఇంకొక శాఖకి మార్చారు ? బలవంతమయిన, ఋణ రహితమయిన దేశం ఏదీ ఇలాగ పెద్ద అప్పులు తీసుకోవు. నెహ్రూ ఉపాయం ఘోరంగా విఫలం అయిందనటానికి ఇదొక నిదర్శనం.

మనని వేధించే ప్రధాన సమస్యలలో ఒకటి ఎమర్జెన్సీ లేదా అత్యవసర పరిస్థితి అన్నది సంభవించటం. మరొక ముఖ్య సమస్య నీతి అన్నది దాదాపు అదృశ్యం కావటం. నెహ్రూని మీరేమన్నా అనండి, ఆయన చోరుడుకాడు. మరి ఇప్పటి నాయకుల సంగతో ? హాజీమస్తాన్, ఇంకా అలాంటివాళ్ళు ఎందరు నాయకులుగాలేరు ? హాజీ మస్తాన్‌కీ అబ్దుల్ రెహమాన్ అంతూలేకీ మధ్య మంచి స్నేహం, అబ్దుల్ రెహమాన్ అంతూలేకీ నెహ్రూ కుటుంబానికీ మధ్య మంచి స్నేహం — అంతూలే పట్టుబడేదాకానే ఈ స్నేహం కొనసాగిందనుకోండి. ఆయన పట్టుబడిపోయి స్నేహానికి అపాత్రుడయిపోయాడు. ఎంత చదువురాని భారతీయుడయినా "రెండూ + రెండూ = నాలుగు" అని తెలుసుకోలేడూ ? ఈ వింత స్నేహాల వెనుక ఏమి ఉందో; అనుకోడూ ?

భారతదేశానికి ఇప్పుడు కావలిసింది, మరొక రకం ఆర్థిక వ్యవస్థ. దానికోసం దేశంలో అన్వేషణ జరుగుతోంది. ఇలాంటిది ఏదో వస్తేకాని మన ఆర్థిక స్థితి మెరుగుపడి ముందుకి సాగిపోలేదు, అధికారంలో ఉన్న రాజకీయవాదులు సృష్టించిన నైతిక కాలుష్యాన్ని తొలగించలేదు. కోట్ల ఖర్చుతో ఆసియాడ్, లేదా త. దే. శి. స. వేడుకలు జరిపి టి. వి. మీద అమిత ప్రచారం సాధించవచ్చునని శ్రీమతి గాంధీ అనుకుంటూ ఉండి ఉండవచ్చు. జనసామాన్యంయొక్క అభిప్రాయం ఇంకొక విధంగా ఉంది. కొన్ని పత్రికలలో పడిన సంపాదకీయాలూ, కొందరు సంతుష్టులు రాసిన వ్యాసాలూ — వాటిని తీసెయ్యండి. వినయంగా తమ కలాలని వాడిన కొందరికి వి. ఐ. పి. సూట్‌కేసులు బహుమానంగా ఇచ్చారు — దీనిని మరిచిపోండి. వివిధ పత్రికలలో సంపాదకీయాల పక్కనపడిన లేఖలని కొన్నిటిని చదవండి. నియంతలు, దుండగులు, బందిపోటులు కలిసి సమావేశాలు జరుపుకుంటే వాళ్లమీద ఇన్ని కోట్లు ఖర్చుచేసి ప్రభుత్వం చాలా జుగుప్సాకరంగా ప్రవర్తించింది. త. దే. శి. స. ఒక జుగుప్సాకరమయిన సంఘటన కాక మరేమిటి ? ఇటువంటి జుగుప్సాకరమయిన సమావేశం ఒకటి ఇక్కడ జరిగిందంటే దానికి వీలు కల్పించినది, నెహ్రూ నెలకొల్పిన అభివృద్ధి ఉపాయమే. ★

# ఇంకో చరిత్ర

అద్దేపల్లి సుచిత్రాదేవి



కాలింగ్ బెల్ సంగీతబద్ధంగా మోగింది. ఫేక్ నవలలో పూర్తిగా లీనమయిపోయివున్న శిరీష పేజీ నెంబరు గుర్తుంచుకుని, పుస్తకం మూసేసి లేచింది.

యధాలాపంగా వెళ్ళి తలుపుతీసిన శిరీష గుమ్మంలోవున్న వ్యక్తిని చూసి "కలా, నిజమా" అన్నట్లు బొమ్మలా నిలుచుండిపోయింది.

ఆమెను చూసి అతను పలకరింపుగా మృదువుగా నవ్వాడు.

"బాగున్నావా శిరీ" అడిగాడు.

ఆ స్వరంతో తెప్పరిల్లిన శిరీష చప్పున కళ్ళు వాల్చేసుకుంది.

"ఎలా అడగ్గలుగుతున్నాడా మాట ?" మౌనంగా వెనక్కి తిరిగింది. చొరవగా వెనుకే వచ్చిన అతను తనే సోఫాలో కూర్చున్నాడు, ఆమె చెప్పకపోయినా.

అతని కళ్ళు ఆమెని ఆపాద మస్తకము పరిశీలిస్తున్నాయి.

ఆ చూపులో ఆరాధన వుంది. ఆత్మీయత వుంది. యింకా అంతకన్నా చెప్పలేని మధురభావన వుంది.

శిరీష మనసు యివన్నీ గమనించే స్థితిలోలేదు.

"ఎందుకొచ్చినట్లు యిప్పుడు గౌతమ్ ? ఏమీ జరగనట్లు ఎంత మామూలుగా ప్రవర్తిస్తున్నాడు ?" అతన్ని కసితీరా తిట్టాలని, మెడపట్టి గెంటాలనీవుంది వుడికిపోతున్న మనసుకు.

కాని మనసు చేసే సూచనలు గమనించలేనట్లు స్తంభించిపోయింది మెదడు. అలానే అచేతనంగా వుండిపోయింది.

"డాక్టరుగారిని చూసేందుకు వచ్చాను. మీరిక్కడే వున్నారని తెలిసి... నిన్ను చూడాలనిపించి..." ఎదుటివారిని మంత్రముగ్ధులను చేసేలా కబుర్లు చెప్పగల అతను మాటలకోసం వెతుక్కుంటూ ఆగిపోయాడు.

ఆమె అసలు విన్నదో లేదో తలెత్తికూడా చూడలేదు. నిముషాలు నిశబ్దంలో కరిగిపోతున్నాయి. ఆ మౌనం అవమానంగా తోచింది గౌతమ్‌కి.

"మంచినీరిస్తావా శిరీష" అడిగాడు.

ఆమె లోపలి కెళ్ళింది.

ఇల్లంతా ఎక్కడి వస్తువులక్కడ చక్కని ఫర్నిచర్‌తో నీట్‌గా సర్దివుంది. మంచి అభిరుచిని తెలియచేస్తూ అక్కడక్కడా గోడలకి వున్న పెయింటింగ్స్ చూస్తున్న అతని కళ్ళు ఒకేచోట ఆగిపోయాయి.

అక్కడ శిరీష, రవీంద్రల పెళ్ళి ఫోటో వుంది. అందులో శిరీష పెదవులు నవ్వుతున్నట్లున్నా కళ్ళు వుదాసీనంగా వున్నాయి. అతను మాత్రం నిర్మలంగ నవ్వుతున్నాడు.

"ఆ ఫోటోలో శిరీష పక్కనుండాల్సిన తను..."

మనసులో రేగే అలజడిని అదుపులో పెట్టుకుంటూ టేబిల్ మీదున్న 'సన్‌డే' అందుకున్నాడు.

ఆ పేజీలు తిరగేస్తుండగా శిరీష చల్లని నీళ్ళు తెచ్చింది.

ఆమె వంక చూడకుండా గ్లాసు అందుకుని అందులో ఒక్కచుక్క కూడా మిగల్చకుండా అన్నీ తాగేసాడు.

* * *

"అబ్బ, మరీ దాహంతో గొంతు ఎండుకుపోతున్నట్లు ఎప్పుడు నీళ్ళిచ్చినా గ్లాసులో ఒక్క

చుక్క కూడా మిగల్చక యింకా గ్లాసు కూడా ఎక్కడ మింగేస్తావో అన్నట్లు తాగుతావేమిటి ?" ఎగతాళిగా అడిగింది శిరీష.

"మరి నీ చేత్తో యిచ్చిన నీళ్ళు అమృతము కదా, అమృతాన్ని కొద్దిగా కూడా మిగల్చకూడదు" చిలిపిగా నవ్వాడు గౌతమ్.

"అవున్లే. ఎదురుగా వుంటె అమృతమూ, దేవతా అంటూ పొగుడు, కనుమరుగైతే అసలు గుర్తు వుండను. అవునా ?"

"మై గాడ్ నిన్ను మరిచిపోవటమా. నువ్వు నా వూపిరిలో వూహాలలో కనులలో కలలలో ... "

"స్టాప్, యిప్పుడు నీకు యిక ఎక్కడికీ వెళ్ళాల్సిన పని లేదుగా" మధ్యలో ఆపి అడిగింది శిరీష.

"లేదు, ఏం ?"

"రైట్, యీ నాలుగు గోడల మధ్యా ఎందుకూ, చక్కగా డాబామీద కెళదాం. ప్రొద్దున అమ్మ చేసిన స్వీట్సు తింటూ నీ కవిత్వం వింటాను" మెట్లవైపు దారి తీసింది శిరీష.

"అవునూ, నువ్వు కాలేజి నుంచి ముందుగానే వచ్చేసావేం ? లాస్టవర్ డుమ్మానా ?" ఆమెని అనుసరిస్తూ అడిగాడు.

"డుమ్మానే. ఆ బ్రహ్మమీసాల హిస్టరీ మాష్టరు క్లాసంటే భయం బాబూ, ప్రశ్నల మీద ప్రశ్నలడిగి దడదడ లాడించేస్తాడు,"

"అలా అని క్లాసులెగ్గొడితే రేపెవరికి నష్టం."

"దేశానికేం నష్టం లేదులే" తేలిగ్గా అనేసింది.

"ఆహా. పెద్ద దేశభక్తురాలు బయలుదేరిం దండీ. అన్నీ దేశానికి లాభమా, నష్టమా అని చూసే చేస్తుంది" వెక్కిరింతగా అన్నాడు.

"అవునట. యీమధ్య యీ దేశభక్తురాలు ఓ మాటకారి అబ్బాయిగారి భక్తిలో పడిపోయిందట."

"వ్వ్, ఎవరీ రసాభాసగాడు ?" అమాయకంగా అడిగాడు గౌతమ్.

"ఛ, రసాభాసకాదు, రసవత్తరమనాలి"

"వూషు, ఏ రసమట ?"

"నిమ్మరసమట" ఫక్కున నవ్వింది శిరీష.

"మరికనేం, ప్రేమ పైత్యానికది చక్కగా పనిచేస్తుంది" తనూ పెద్దగా నవ్వేసాడు గౌతమ్.

* * *

గతంలోని జ్ఞాపకాలతో మనసు వూగిస లాడు తుంటే అతని చేతిలోంచి కాళీ గ్లాసందుకుంది శిరీష.

ఆమె ఏమన్నా మాట్లాడుతుందేమోనని కొద్ది సేపు ఎదురు చూసాడు గౌతమ్. అయితే ఆమె పెదవి విప్పలేదు.

ఆ తిరస్కారం వూహించనిది కాకపోయినా అతని మనసు విలవిల్లాడింది. "వెళుతున్నాను" లేచి నిలుచున్నాడు.

హృదయాకాశంలో కమ్ముతున్న భావాల మేఘాలతో వర్షించటానికి సిద్ధంగా వున్న కళ్ళ అతని కంట పడకుండా తల అటు తిప్పుకుంది శిరీష.

గుమ్మందాకా వెళ్ళిన గౌతమ్ వెనక్కి తిరిగి అన్నాడు. "శిరీ నువ్వీరోజు నాతో ఒక్కమాట అయినా మాట్లాడలేదు. అలా మాట్లాడలేదేం అని నీతో దెబ్బలాడే అర్హత, పలికే తీరాలని శాశించే అధికారమూ రెండు పోగొట్టుకున్నాననీ నాకు తెలుసు. అసలు నేనలా ఎందుకు చేశానని నన్ను నిలదీసి అడిగినా, నిందించినా, అవమానించినా నాకు యింత బాధ కలిగేది కాదు. కానీ అసలు నాతో మాట్లాడటమో, నా వంక చూడటమో నీకసహ్యం అన్నట్లుంది. అలాంటప్పుడు యింకా నీ ఎదుట వుండటం భావ్యం కాదు, నస్తాను. నీకింత సమీపంగా వచ్చి, నిన్ను చూడకుండా వుండలేక వచ్చాను. నేనిలా రావటం నీకు మనస్తాపం కలిగిస్తే మన్నించు."

అతను వెళ్ళిపోయాడు. కానీ ఒక్కక్షణం వెనుదిరిగి చూసివుంటే ఆమె కన్నీరు అతని మండే మనసును చల్లబరిచి వుండేదేమో !

ఆ మరునాడు పొద్దున రవీంద్ర ఆఫీసుకు వెళ్ళిన తర్వాత, "అంకుల్ ఏంచేస్తున్నారో నిన్నంతా వెళ్ళనేలేదు" ఎదురింటివైపు నడిచింది శిరీష.

డాక్టరుగారు ఒక్కరు వాలుకుర్చీలో కూర్చుని చదరంగంలో పావులు సర్దుతున్నారు.

"గుడ్ మార్నింగ్ అంకుల్" అన్న తియ్యని స్వరానికి తలఎత్తి చూసి చిన్నగా నవ్వారు.

"రామ్మా, రవీంద్ర ఆఫీసుకు వెళ్ళాడా ?" ఆదరంగా ఆహ్వానించారు.

"ఆ, యిప్పుడే. మీరేమిటి, ఒక్కరే ఆడు కుంటున్నారా" ఎదురుగావున్న కుర్చీలో కూర్చుంటూ అడిగింది.

"నువ్వొచ్చేసావుగా."

"అదేమిటంకుల్, పరాగ్గా వున్నట్లున్నారు అన్నిటి స్థానాలు మార్చేసారు" పావులను సవరిస్తూ అన్నది శిరీష.

దానికి నవ్వుతూ ఆయన ఏదో అనబోయేంతలో టెలిఫోన్ మ్రోగింది. లేచి వెళ్ళి రిసీసరు అందు కున్నారు.

"హలో !"

అవతల ఎవరు ఏం మాట్లాడారో కానీ డాక్టరుగారి ముఖం అదోలా మారిపోయింది.

"నో, డాక్టర్ నా వల్లకాదు. నేనిక డాక్టరుగా హాస్పిటల్లో అడుగుపెట్టేది లేదని ఎన్నోసార్లు చెప్పాను. అయినా మళ్ళీ మళ్ళీ ఎందుకడుతారు, మీరే చూసుకోండి."

శిరీష కుతూహలంగా వింటూంది.

అవతల ఏమన్నారో ఆయనీసారి కొంచెం కటువుగా చెప్పారు.

"ఎంత క్రిటికలయినా సరే, నేను రాలేను. దయచేసి నన్ను పిలవద్దు" చప్పున ఫోన్ పెట్టేసారు.

ఆయనలో ఏదో సంఘర్షణ వచ్చి వాలుకుర్చీలో వెనక్కివాలి కళ్ళు మూసుకున్నారు.

కొద్దిసేపు మౌనంతర్వాత "అంకుల్" మెల్లగా పిల్చింది శిరీష.

ఆయన కళ్ళుతెరిచారు. బలవంతాన మామూ లుగా వుండటానికి ప్రయత్నిస్తూ నవ్వబోయారు.

శిరీష కొన్నిక్షణాలు తటపటాయించినా అడ క్కుండా వుండలేకపోయింది.

"అంకుల్, ఎంతో అనుభవమున్న డాక్టర్ మీరు. హాస్పిటల్‌కి ఎందుకెళ్ళరు ? పేషంట్ల నెందుకు చూడరు? ఎన్నోసార్లు అడగాలనుకున్నాను. నన్ను మీ అమ్మాయిలాంటి దాన్నంటారుకదా, నాక్కూడా చెప్పకూడదా ?"

శిరీష వంకోసారిచూసి ఆయన మళ్ళీ కళ్ళు మూసుకున్నారు.









తర్వాత చెప్పసాగారు. "నిజమేనమ్మా ఎంతో అనుభవమున్న డాక్టరును నేను. మంచి డాక్టరుగా పేరుపొందాను. అయితే ఆ పేరు వల్లనే నా డయాగ్నసిస్ మీది నమ్మకంతో గౌతమ్ మరేడాక్టరుదగ్గరకు వెళ్ళక తను ప్రేమించినఅమ్మాయిని దూరం చేసుకున్నాడు. నా పొరపాటువలన ఒక ప్రేమ జంట విడిపోయింది. మనిషిగా అంతకన్నా పాపమేంచేయాలి? డాక్టరుగా వృత్తికంతకన్నా ద్రోహమేం చేయాలి?"

శిరీషకేం అర్థంకాలేదు. "అంకుల్, ఏమిటి మీరనేది ?"

## ఇంకో చరిత్ర

"అవునమ్మా, ఒకరోజు నా దగ్గరకు ఒకే పేర్లుకల యిద్దరుపేషంట్లు వచ్చారు. ఇద్దరికీ ఒకే టెస్టులు జరిగివున్నాయి. రిజల్ట్సు మారిపోయాయి. సామాన్యంగా అలాంటిపొరపాటు జరగదు. కానీ జరిగింది. ఏదో చిన్న అనుమానంతో నా దగ్గరకువచ్చిన గౌతమ్‌కి బ్లడ్‌కేన్సరని తేలింది. అసలు వ్యాధి ప్రారంభదశలో వున్నతనికి ఏవో మామూలుగా మందులువ్రాసిచ్చి పంపాను. ముఖం చూసే వ్యాధిని అంచనావేయగలననుకునే నేనే పొరపాటు పడ్డాను. నేను కేన్సరనిచెప్పిన గౌతమ్ న స్నేహితుడి బంధువులబ్బాయి. అతనికప్పటికి నె రోజులలో పెళ్ళి నిశ్చయమైవుందట. అది యిర వైపులా పెద్దలు యిష్టపడిన ప్రేమ వివాహమట ఎందరి ప్రేమకథలు పెళ్ళివరకూ వస్తాయి? అయితే మరో ఆరునెలలలో ముగియబోయే తన జీవితంతో ప్రేమించినఅమ్మాయిని పెళ్ళాడి ఆమె జీవితాన్ని బలి తీసుకోలేక గౌతమ్ ఎవరికీ ఏమీ చెప్పక యింట్లోంచి వెళ్ళిపోయాడట."

"ఇదెవరి కథ?" శిరీష కళ్ళు పెద్దవి చేసుకుని వింటూంది.

డాక్టరుగారు చెబుతున్నారు.

"కానీ అసలు కేన్సరున్న వ్యక్తి ఓ నెల తర్వాత మళ్ళీ నా దగ్గరకు వచ్చాడు. అతని కండిషన్ చూసి అనుమాన మొచ్చి మళ్ళీ పరీక్షలు జరిపి చూస్తే అతనికి కేన్సరు! అప్పుడు నా పొరపాటు తెలిసింది. ఏం చేయాలి నేను ? వెంటనే నా స్నేహితుడ్ని కలుసుకుని గౌతమ్ గురించి అడిగాను. అతనప్పటికే యింట్లోంచి వెళ్ళిపోయాడని తెలిసింది. ప్రేమ ఫలించక జీవితంలో యిలా ఒంటరిగా మిగిలిపోయిన నాకు ప్రేమించినవారికి దూరమై బ్రతకటం ఎంత దుర్భరమో తెలుసు. అందుకే గౌతమ్ స్నేహితులందర్నీ విచారించి అతని అడ్రసు కనుక్కో గలిగాను. అతనితో నా పొరపాటు చెప్పి వెంటనే యింటికెళ్ళి జరిగిన విషయం చెప్పుకున్నాను. అత నెంతో సంతోషంగా వెళ్ళాడు. కానీ అప్పటికే ఆ అమ్మాయికి మరో వ్యక్తితో పెళ్ళయిపోయింది. శుభలేఖలదాకా వచ్చిన పెళ్ళి అర్ధాంతరంగా ఆగిపోవటంతో ఆ అమ్మాయి తండ్రి గౌతమ్ కుటుంబాన్ని నానావిధాల దూషించి తన డబ్బు, పలుకుబడితో అదే ముహూర్తానికి కూతురికి వివాహం జరిపించేసారుట. నావలనేకదూ యింత జరిగింది ? ఆ నాడే డాక్టరుగా నా వృత్తికి నేను తగనని నిర్ణయించుకున్నాను. నా హాస్పిటల్ అసిస్టెంట్లు కప్ప గించేసాను.

తన కారణంగా నేను వృత్తికి దూరమయ్యా ననీ, నా విజ్ఞానాన్ని వృధా చేస్తున్నానని గౌతమ్ బాధపడతాడు. నా తప్పును అతను తన మాన వత్వంతో క్షమించాడు. కానీ నన్ను నేను క్షమిం చుకోలేకపోతున్నాను. నిజానికి అతని ప్రేమను భగ్నం చేసిన కారణంగా నన్ను ద్వేషించివున్నా నాకింత వేదన వుండదేమో ! చిత్రంగా అతను నాకు దగ్గరయాడు నన్ను మళ్ళీ డాక్టరుగా చూడాలని, అతని ఆశ, కోరిక, కానీ... కానీ యిక నేను వైద్యం చేయలేను." ఆయన కన్నుల్లో తడి.

శిరీష పిచ్చిగా చూసింది. ఆమె తన మనసు లోని రూపానికి కన్నీటితోనే మాలలు వేసింది.

"అంకుల్, అయితే నిన్న వచ్చినతనేనా మీరు చెప్పే గౌతమ్ !" తడబడే స్వరంతో అడిగింది.

ఆయననుంచి వచ్చే జవాబుకై వూపిరి బిగ పట్టింది.

"అవునమ్మా. గౌతమ్ నాకు నచ్చచెప్పాలని చూస్తాడు, కానీ..."

ఆయనింకా ఏదో చెబుతూనే వున్నారు. కానీ శిరీషకి వినిపించింది "అవునమ్మా" అన్న మాట మాత్రమే.

★

# ఉచితం




# ఒక క్యాడ్‌బరీస్ జెమ్స్ ప్యాక్
# బోర్న్‌విటా యొక్క 500గ్రా॥ ప్యాక్‌తోబాటు

ప్రత్యేకమైన కానుక! ప్రత్యేకమైన లేబుల్‌గల 500 గ్రా. బోర్న్‌విటా డబ్బా లేదా రీఫిల్ ప్యాక్ అడిగి తీసుకోండి! దీనిలోపల ఉండే క్యాడ్‌బరీస్ జెమ్స్ యొక్క ఉచిత ప్యాక్ పొందండి.







## క్యాడ్‌బరీస్
# బోర్న్‌విటా
## దీన్లోని మంచిదనం పెరుగుతుంది మీపైనిక

OBM/1083/TL

# మందులెందుకు? టానిక్కులు దేనికి?

"ఎంత కష్టపడయినా ఒక టానిక్కు కొని వాడుతారుకాని దాని బదులు మంచి ఆహారం తీసుకోమంటే పట్టించుకోరు !" అన్నారు ఒక డాక్టరుగారు నాతో ఒకసారి. ఆయన క్లినిక్కులో కూర్చుని టానిక్కులు రాయించుకుని వెళ్ళేవారిని చూసి నేను వెలిబుచ్చిన సందేహానికి ఆయన సమాధానం ఇది ...

## కెమోథెరాపీ

కొన్ని దశాబ్దాల ముందు పరిశోధకులు రోగాలని నయంచేసేందుకు "కొత్త" పద్ధతిని ఒకదానిని మొదలుపెట్టారనవచ్చు. రోగం దేనివల్ల వస్తుందో తెలుసుకుని, రోగానికి కారణం అనిపించే వాటిమీద — రోగి దేహంలో కాదు, బయట ! — కొన్ని పదార్థాలని వాడిచూసి, ఈ పదార్థాలనే క్రమంగా రోగుల మీద వాడటమే ఈ కొత్త పద్ధతి. [దీనిని ఇంగ్లీషులో "కెమోథెరాపీ" అంటారని కూడా అనుకోవచ్చు ! "రసాయన పదార్థాల ద్వారా చికిత్స"అని దీనిని అనువాదం చేసుకోవచ్చునేమో...] సాల్వర్సాన్, పాలుడ్రిన్, సల్ఫా మందులు, అంటీ బయాటిక్ ఔషధాలు వగయిరా ఈ కోవకి చెందినవే.

రోగ చికిత్సలో ఈ రకం మందులు వాడినట్లే దేహాభివృద్ధికి కూడా కొన్ని రసాయన పదార్థాలని వాడటం మొదలయింది. పాత టానిక్కులమీద నమ్మకం సడలటంకూడా మొదలయింది.

ఉదాహరణకి ఇనుముకల పదార్థాలవాడకం తీసుకోవచ్చు. నెత్తురులో ఇనుముఉంటుంది కనుక ఇనుము తినాలని కొందరు ఊహించారన్నమాట. వారి ఊహ వ్యర్థంకాలేదు. ఇనుము కలిపినమందులు బాగా అమ్ముడుపోతూ ఉంటాయి ! నిజానికి ఇనుము కలిసిఉన్న టానిక్కులు పనిచేస్తాయా ?

## గ్లూకోసు

గ్లూకోసు సంగతి అందరికి తెలుసు, అనుకుంటారు. దీనిని సేవిస్తే త్వరగా 'శక్తి'వస్తుందని అందరూ అనుకుంటారు. వారి అభిప్రాయం సరి కాదు ! గ్లూకోసు బదులు పంచదార తీసుకున్నా శక్తి బాగా వస్తుంది. పంచదారేకాదు, అరిగే పిండి పదార్థం ఏదయినాచాలు ! అంతేకాదు, గ్లూకోసు ఎక్కువగాతింటే దేహంమీద కొన్ని వత్తిడులు అధికంకాగలవు. ఇవి తీవ్రమయిన వత్తిడులు కావు కాని వాటి ఉనికిని గుర్తించకతప్పరు.

ఫాస్ఫేట్ టానిక్కులు బాగా ప్రచారంలోకి వచ్చాయి. "గ్లిసరో ఫాస్ఫేట్"లు కల టానిక్కులకి మంచి గిరాకీ ఉంది. కాని, వీటి మూలంగా దేహానికి ప్రయోజనం ఏమీ ఉండదుట. పరిశోధనలు ఈ యదార్థాన్ని స్పష్టంగా తెలుపుతున్నాయి.

## రోగం అంటే ?

ఇటువంటి విషయాలు తరుచు కొన్ని చర్చా వేదికలలో బయటపడుతూ ఉంటాయి. కొంత కాలం కింద బ్రిటిష్ మెడికల్ జర్నల్‌లో "రోగం అంటే ఏమిటి ?" అన్న అంశంమీద పలువురి అభిప్రాయాలని సేకరించి వేశారు. ఆ చర్చ సారాంశం 'ఆంధ్రపత్రిక'లో పడింది కూడా. ఒక గాజుపాత్రలో మందులు పని చేసినట్లుగా ప్రాణుల దేహాలలో పని చెయ్యవన్న వాదం కొంత బలపడుతున్నట్లు తోస్తుంది. రెనెదుబోస్ అనే వైద్యశాస్త్రవేత్త రోగాలకీ, నాగరకతలకీ, పరిసరాలకీ మధ్య గాఢమయిన సంబంధం ఉంటుందని అంటూ ఉండేవారు.

కొంతకాలం కింద "న్యూ సయింటిస్ట్" పత్రికలో దేహంలో కొలెస్ట్రాల్ పెరగటానికి కేవలం ఆహారం మాత్రమే కారణం కాదని నిర్ధారణ అయింది, మనుషుల మానసిక స్థితి కూడా కొలెస్ట్రాల్ పెంచటానికి సహాయపడుతుంది. అయినా వైద్యులు — మందుల కంపెనీల వారు కలిసి ఒకరకం ప్రచారం చేస్తూ ఉంటారు — అని 'న్యూ సయింటిస్ట్' పత్రికలో ఒక వార్తాంశం స్పష్టంగా వివరించింది.







## పాలింగ్ చిట్కా

సుప్రసిద్ధ శాస్త్రవేత్త లయినస్ పాలింగ్ ప్రకారం వయిటమిన్ 'సి' పెద్ద మొత్తాలను తింటే జలుబులకి మంచిది; కాని, అమెరికా వైద్యుల సంఘం వారు అంగీకరించరు. వారికీ, పాలింగ్‌కీ వాదోపవాదాలు జరుగుతూ ఉంటాయి !

కాఫీ, టీలలో కెఫెయిన్ ఉంటుంది కనుక ఆ పదార్థాన్ని కొన్ని టానిక్కులలో కలుపుతూఉంటారు. ఇది చురుకుదనాన్ని పెంచుతుందని కబోలు. ఇది మంచిపని కానేకాదు. కెఫెయిన్ జీర్ణశక్తిని తగ్గించ గలదు, రక్తస్రావాన్ని వెడగొట్టగలదు. కోక-కోలా వంటి పానీయాలలో కెఫెయిన్ చాలానే ఉంటుంది. గర్భంలో ఉన్న ఆడవారికి కెఫెయిన్ మంచిది కాదు.

పాశ్చాత్యదేశాలలో 'ఫాషన్' లు తేలికగా మారుతూఉంటాయి. ఈమధ్య అమెరికా సంయుక్త రాష్ట్రాలుమొదలయినదేశాలలోటానిక్కులలో"సహజ' మయిన వాటిమీద విశ్వాసం పెరుగుతోంది. మూలికలనుంచితీసిన టానిక్కులే మంచివన్న అభిప్రాయం బలపడుతోంది. అందుకనే చీనాలో అనాదిగా వాడబడుతూవచ్చిన 'గిన్ సెంగ్' వేరులునుంచి తీసిన టానిక్కులకి పాశ్చాత్యదేశాలలో మంచిగిరాకీ ఉంది! ఇతర మూలికల మందులమీదకూడా ఆసక్తి పెరుగుతోంది. పాతకాలపుమందులు చాలా వార్ధక్యంలో బాగా పనికివస్తాయని కొందరు "నిపుణులు"అంటున్నారు.

## డి.ఎమ్.ఎ.ఇ; డి.ఇ.ఎ ఇ.

అయితే, ఆధునిక ఔషధాలలో టానిక్కులే లేవు– అనుకోవాలా? ఇటువంటి అభిప్రాయం సరి




కాదని కొందరు హెచ్చరిస్తున్నారు. పాంగానిక్ ఆసిడ్, నికోటినెమయిడ్, సి – వయిటమిన్, డై మిథయిల్, డై– ఈథయిల్ ఇథనా లెమీన్‌లు [డి. ఎమ్. ఎ. ఇ., డి. ఇ. ఎ. ఇ. అంటారువీటిని] సెంట్రో ఫినాక్సిన్– కొన్ని మంచి "ఆధునికపు" టానిక్కులు.

అసలు టానిక్కులంటే అర్థం ఏమిటి? దేహస్థితిని, మెరుగుపరిచేవి, వార్ధక్యంయొక్క ప్రభావాన్ని తగ్గించగలిగినవి టానిక్కులనవచ్చు.

ఏదిఏమయినప్పటికీ రోగాలకి విరుగుడుగా మందులు; ఆరోగ్యానికి దోహదకారులుగా టానిక్కులు వాడాలనే సిద్ధాంతం ఆతిప్రాచీనమయినది. ఇందులో ఎంత సత్యం ఉందో ఇప్పుడిప్పుడు మరింత తెలుస్తోంది.

– ఎస్. *

# వ్యక్తిగతం



కృష్ణాజిల్లా పరిషత్తు అధ్యక్షునిగా తెలుగుదేశం పార్టీ అభ్యర్థి శ్రీ సుంకర సత్యనారాయణ ఒక్క ఓటు మెజారిటీతో గెలిచారు. కాంగ్రెస్ [ఐ] అభ్యర్థిని శ్రీమతి కె. రామతులశమ్మకి 21 వోట్లు, శ్రీ సుంకరకి 22 వోట్లు వచ్చాయి. కాంగ్రెసు [ఐ]లోని ముఠా తగాదాలే ఈ ఎన్నికలో కూడా ఆ పార్టీ పరాజయానికి దారితీశాయి...



సోవియెట్ యూనియన్ విదేశాంగమంత్రిగా ఉంటున్న శ్రీ ఆంద్రెయిగ్రొమీకో ఇటీవలే ఆ దేశానికి ప్రథమ ఉపప్రధాన మంత్రిగా 'ప్రమోట్' అయ్యారు. శ్రీ ఆంద్రొపొవ్ ఆరోగ్యం అంత సంతృప్తికరంగా లేకపోవటం చేతనే శ్రీ గ్రోమికోని ప్రథమ ఉప ప్రధాని చేశారని కొందరి వ్యాఖ్య...



పూర్తిగా బొమ్మ గుండెతోనే 112 రోజులు బతికిన తొలి వ్యక్తి బార్నీ క్లార్క్ మార్చి 23న మరణించారు. దంత వైద్యుడిగా పనిచేసి రిటైరైన డా. క్లార్క్‌కి 1982 డిసెంబరు 2వ తేదీన డా. రాబర్ట్ జార్విక్ రూపొందించిన కృత్రిమ హృదయాన్ని అమర్చారు. హఠాత్తుగా రక్త ప్రసారంలో లోపం ఏర్పడటం వల్ల శరీరంలోని ప్రధానాంగాలన్నీ విఫలమై మరణం సంభవించిందని డాక్టర్లు అన్నారు. అంతకి ముందు రెండు వారాలుగా ఆయనకి జ్వరం వస్తూ ఉండేదని, మూత్రపిండాలు మామూలు స్థాయికంటే తక్కువగా పని చేశాయని వారు తెలియచేశారు ...

# వారఫలం

6-5-1983 శుక్రవారం మొదలు 12-5-1983 గురువారం వరకు

♈ **మేషం:** మీది భారీ వ్యాపారమయితే బాగా సాగిపోతుంది. పత్రికా వ్యాపారమయితే క్రొత్త మార్పులుంటాయి. అధికారుల వలన ఏదో మేలు జరుగనున్నది. ఆదాయ లోపం లేదు. స్త్రీలకు: ధన ధాన్య వస్తు సేకరణకు అనుకూలం గల వారమే.

♉ **వృషభం:** సావకాశంగా మీ పనులు నెరవేరుతాయి. తొందర పడి కావలసిన పనులు చెరచుకోకండి. భూమి కొనుగోలు చేయనున్నారు. కొందరకు ఆరోగ్యలోపం ఏర్పడనున్నది. జాగ్రత్త! స్త్రీలకు: సుఖ, భోగ భాగ్యాలకు అవకాశం గలవారం. విద్యా యోగ్యతకు అవకాశమున్నది. లేనిపోని వ్యవహారాలలో జోక్యం ఉంటుంది.

♊ **మిథునం:** అధికారులతో జరుగవలసిన పనులు అనాయాసంగా జరుగుతాయి. అప్రయత్న ధనలబ్ధి చేకూరుతుంది. అపరిచితుల మూలాన అధిక ప్రయాస ఏర్పడుతుంది. వ్యాపారం యథాతథంగా సాగిపోతుంది. స్త్రీలకు: దూర ప్రాంతాలకు పోగల అవకాశాలు ఏర్పడుతవి. సుఖ శాంతులకు అవకాశం గలవారం.

♋ **కర్కాటకం:** అయినవారి సంబంధం కొరకు అధిక తాపత్రయపడుతారు. అనవసరమే, కాని వ్యవహారమంతా యిలా ఉంటుంది. అవసరాలు మీ వలన తీర్చుకొనే వారే గాని, మీకు మేలు చేసే వారే లేరని గ్రహిస్తారు ఈవారం. స్త్రీలకు: ముఖ్య రంగాలలో ఆదాయం అనుకూలం సంభవమే ఈవారం.

♌ **సింహం:** దూర బంధువులు యింటికి రావటం, సుఖం, ఆనందం, శుభ కార్య ప్రస్తావనలుంటాయి. కొందర యిండ్లలో 'శుభం' కూడా జరుగవచ్చు. నూతన వస్తు సేకరణకు అవకాశం గల వారం, గ్రహించండి. స్త్రీలకు: ధన లోపం లేక ఉద్యోగావకాశంలో, రాజకీయ రంగంలో, సంఘంలో మేలు చేకూరనున్న వారమని గ్రహించాలి.

♍ **కన్య:** మీ ప్రతిభ రాణించే అవకాశాలున్నాయి. మీ రంగస్థల నటనా సామర్థ్యం రాణింపునకు రాగలదు. మీ చిత్ర రంగానుభవం 'మూడు పూలారు కాయలుగా' విస్తరింపగలదు. వ్యాపారం చేసేలాగయితే ఆదాయం, క్రయ విక్రయానుకూల్యం సంభవం. స్త్రీలకు: వాహనం కొనాలన్నా, భూమి సేకరించుకోవాలన్నా వసతి యేర్పాటు గావించుకోవాలన్నా ఈవారం లాభదాయకం అనుకూల ప్రదాయకం.

♎ **తుల:** వ్యాపారంలో ఎలాంటి ఒడిదుడుకులు లేకుండా సాగుతుంది. వ్యవహారం మిత్ర బంధువుల సాయంచే అనుకూలమవుతుంది. ఆరోగ్య లోపం కొందరిపట్ల, రాజకీయంగా యిబ్బందులు కొందరపట్ల తొందరపాటు వలన నష్టం కొందరపట్ల చెప్పవచ్చు. స్త్రీలకు: గృహ చింతన, ఉద్యోగంలో యిబ్బంది చెప్పవచ్చు.

♏ **వృశ్చికం:** మిత్రుల వలన మేలు చేకూరుతుంది. అనుకోకుండా యింటికి పరిచితులు రానున్నారు. అనవసరమైన ఖర్చు తగిలే అవకాశమున్నది. వ్యాపార నిమిత్తం మీరు చేసే ప్రయాణాలు ఫలదాయకాలే. స్త్రీలకు: విలువగల వస్తు సేకరణకు అనుకూలత ఉన్నది.

♐ **ధనుస్సు:** చాలమందికి వ్యాపారంలో మేలు చేకూరటం, వ్యవహారంలో విజయం చేకూరటం, సంతానం కొరకు చేసే ఉద్యోగ ప్రయత్నాలు ఫలవంతం కావటం గమనించగలరు. స్త్రీలకు: సుఖ శాంతులు, ఉద్యోగంలో అభివృద్ధి, కించిత్తు ఆదాయం చెప్పదగిన వారం.

♑ **మకరం:** భూమిగాని, యిండ్ల స్థలం గాని, నగలు నాణ్యాలు గాని, విలువగల వస్తువులు గాని, తుదకు వాహనం గాని కొనుగోలు చేయగలరు. ఇతరుల సాయం కోరుకొన్నారు గదా! అది సిద్ధించే మార్గమున్నది. స్త్రీలకు: విద్యా యోగ్యత, ధనాదాయం, అప్పులు వసూలు కావటం గమనించగలరు.

♒ **కుంభం:** ధనలబ్ధికి అవకాశం, మిత్రుల వలన జరుగవలసిన పని యేది అయినా అంటే సులభంగా నెరవేరుతుంది. అయినవారి చేత మోసపోవటం కూడా కొందర విషయంలో చెప్పదగిన అంశం. స్త్రీలకు: విద్యా యోగ్యతకు, ఉద్యోగం పెంపుకు అవకాశం గలవారం.

♓ **మీనం:** భూ వసతి ఏర్పడటం, ధనాదాయంలో అభివృద్ధి కనిపించటం, ఆరోగ్యంలో వృద్ధి కనిపించటం, అత్యుత్తములతో స్నేహం లభించటం, సంతాన విషయంలో నిశ్చయించుకొన్న సంబంధమే అనుకూలంగావటం గమనించగలరు. స్త్రీలకు: అందవలసిన డబ్బు చేతికి అందటం, అవసరాలు తీరటం, ఆశించిన మార్పు ఉద్యోగ విషయంలో సంభవించటం చెప్పదగిన అంశాలు. ఆరోగ్య లోపంలేదు.

— విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి ★




కృష్ణస్వామి ఆశ్రమం పెట్టుకున్న తొలినాళ్ళలో యీ బంధాలన్నీ ఆయనకు లేవు. ఆయనకు ఉన్న తోడల్లా మనసులో పుట్టిన ఆలోచనలే. గణపతి దేవుని ఆశ్రయంలో గడిపిన దినాలను కూర్చే జ్ఞాపకాలు.

అనుష్ఠానానికి ఉపక్రమించబోయే ముందు ఆయన ఏకవీరాదేవిని సందర్శించటం అలవాటు. ఆలయాని చుట్టూ ఎత్తైన ప్రహరీ ఉన్నది దుర్గానికి ఉన్నట్టు. ఆ ప్రహరీకి తూర్పు ద్వారం సుప్రసిద్ధమైనది. ఆ ద్వారానికి పెద్ద పెద్ద యినుప మేకులు ఏర్పాటు చేసి అభేద్యంగా ఉంటాయి. ఆ పెద్ద తలుపులకు పార్శ్వ భాగాల్లో చిన్న చిన్న వాకిళ్ళు ఉన్నాయి. దేవాలయంలో పూజలు ముగిశాక, యాత్రికులంతా వెళ్ళిపోయాక పెద్ద తలుపులు మూసివేస్తారు. ఆలయంలో నిత్యమూ జరుగవలసిన పారిశుద్ధ్యపు పనులు చేసే వారూ, అర్చకులూ పదే పదే లోపలకు వెలుపలకూ తిరగటానికి ప్రక్కన చిన్న ద్వారాలు అమర్చారు.

ఆ ద్వారాలలోంచి అందరినీ వెళ్ళనివ్వరు. కృష్ణస్వామి, దేవి దర్శనానికి వెళ్ళేవారిలో దాదాపు ప్రతి నిత్యమూ ప్రథముడే. అప్పటికింకా ఆలయంలో సందడి ఉండదు. ఆ చిన్న ద్వారంల్లోంచే ఆయనా వెళ్ళేవారు. ఒక వైశాఖ పూర్ణిమనాడు కృష్ణస్వామి యధావిధిగా యింకా తెల్లవారేందుకు ఝాముప్రొద్దు ఉన్నదనగా ఆలయానికి వెళ్ళారు. ప్రదక్షిణలు చేస్తున్నారు. ఏకవీరాదేవి ఆలయానికి చుట్టూ చిన్న చిన్న ఆలయాలున్నాయి. కేశవస్వామి ఆలయం, మల్లాగదేవుని ఆలయం మొదలైనవి.

కేశవస్వామి ఆలయపు గోడలు, ఏకవీరాదేవి ఆలయపు గోడలూ చాల దగ్గర దగ్గరగా ఉంటాయి. ఆ గోడల మధ్య ఇద్దరు మనుషులు మాత్రమే వెళ్ళ గల చోటు వుంటుంది. సన్నని సందు అది.

అలా కనీసం పది ధనుస్సుల దూరం వెళ్ళాలి. ఆ వైశాఖ పూర్ణిమనాడు అలా ప్రదక్షిణలు పూర్తి చేస్తూ వుండగా ఆ సందులోంచి పసిపాప ధ్వని వినిపించింది కృష్ణస్వామికి.

ఆయన ఆశ్చర్యంతో వెనుదిరిగి చూచారు. సందులో గోడప్రక్కగా పాత్తిగుడ్డల్లో ఉన్న పసి పాప కనిపించింది. రక్తపు గుడ్డలాఉన్న ఆ పసి కందును చూడగానే ఆయనహృదయం ఆర్ద్రమైంది. కన్నులు చెమ్మగిల్లాయి.

''భావస్థిరాణి జననాంతర సౌహృదాని'' — కాళిదాసు ఊరికే చెప్పాడా ? ఎన్ని జన్మలబంధమో!

**(గత సంచిక తరువాయి)**

ఏకవీరాదేవి ఏమని ఆజ్ఞాపిస్తోంది ? యీ పసి పాపను స్వీకరించమనే కాబోలు అనిపించింది ఆయనకు.

పాత్తిళ్ళ పాపను చేతితో స్పృశించారు. పాప విచిత్రంగా ఏడుపు ఆపేసి యీ కొత్త ప్రపంచాన్ని చూస్తోంది. కవాట ఉద్ఘాటనంచేస్తూ అర్చకస్వామి గంట మోగించటం వినిపించింది. అస్తు. యీ పాప తనది. కృష్ణస్వామి పాపను పొదివి పట్టుకుని ఆలయంలోకి వచ్చారు. పాపను ఏకవీర పాదాలముంచుంచారు.

''తల్లీ ! ఏకవీరా ! యీ జీవితపు చరమాంకంలో నాకు మళ్ళీ యీ బంధాల్ని ఎందుకు సమకూర్చుతున్నావు. సర్వమూ సన్యసించి బాహిరమైన ప్రపంచాన్ని విస్మరించి అంతర్లోకాలను సందర్శించాలని ఉబలాటపడ్డాను. కాని యీ సృష్టి నిరర్థకమైనది కాదనీ, బంధాలన్నీ మానవునికి బంధనాలు కాదనీ యీనాడు మళ్ళీ నాకు జ్ఞాపకంచేస్తున్నావా? ఏ తల్లికన్న పాపమో యీ పాప. నీవే తల్లివై నాకు అప్పగించావా తల్లీ. స్వీకరించాను. నీవు ప్రసాదించిన యీ పసికందును నీ పేరుతోనే పిలుస్తాను. కణ్వమహర్షి అంతటివాడు శకుంతలను పెంచి, పోషించి, పెద్దచేసి పెళ్ళిచేసుకుని, వెళ్ళిపోతుంటే ఎంత విలపించాడో ! ''వైక్లబ్యం మమతా వదీదృశమహోకసః'' అని విలపించాడే. నేను ఏమైపోతానో. నాకు యీ పాపను పెంచి పోషించే మనోధైర్యాన్ని కూడ నువ్వే ప్రసాదించు తల్లీ'' అంటూ ప్రార్థించాడాయన. ఏకవీరాదేవి బుగ్గమీద చిన్న సొట్టతో చిరునవ్వుతోంది. కృష్ణస్వామి పాపకేసి చూచారు. పాప నవ్వుతోంది. బుగ్గమీద అందమైన చిన్న సొట్ట. ''అవునుతల్లీ ! నువ్వు ఏకవీరాదేవి అపరావతారమే'' అంటూ పాపను అక్కున చేర్చుకున్నారాయన.

పాప వొచ్చినప్పుడు ఆశ్రమంలో ఉన్న చిన్ని చిన్ని మామిడి మొక్కలు యిప్పుడు పెద్దవయ్యాయి. గోరింటాకు మొక్కలు పొదలయ్యాయి. లతలు పొదరిళ్ళు అయ్యాయి. ఏకవీరకు యౌవనం పొటమరించింది. రేకు విప్పిన మందారంలా యౌవనం వికసించింది. కృష్ణస్వామి అనురాగంతో లక్ష్మి, పద్మల స్నేహంతో ఏకవీర కాలాన్ని యిట్టే దొర్లించి వేయగలదు. సూర్యోదయ సూర్యాస్తమయాల మధ్యకాలం ఆమెకు క్షణంలో దొర్లిపోయినట్లుంటుంది. అది ఆ వయసుకు తగ్గ మాయ !

---

**జరిగిన కథ — : 1** రుద్రాంబ, గణపతిదేవుల పరిపాలనా కాలంలో వెంకన్నదొర దగ్గర తన ఇద్దరి బిడ్డలతో వెట్టిచాకిరీ చేస్తుంటాడు హరిజనుడు నారాయణ. అతను కృష్ణస్వామి భక్తుడు. ఏకవీర కృష్ణస్వామి ఆశ్రమంలో పెరిగి పెద్దదవుతుంది.

---

మాయామేయమైన జగత్తులో ఏ వయసుకు తగినట్లు ఆ వయసు భ్రమలు కలుగుతాయి నాలుకమీద తేనెరాస్తే పసిపాప కిలకిలా నవ్వుతుంది. ఊతగ్ర కొట్టియిస్తే మనుమణ్ణి ముద్దులాడుతాడు తాతయ్య. అంతలోనే పొంగుతుంది. అదే మాయ. యౌవనం మాయకు పుట్టిల్లు.

ఏకవీర అటువంటి మాయలో చిక్కుకుంది అప్పటినుండీ ఆమె మాటలే మారిపోయ్యాయి.

మొగిలిచెర్ల గ్రామానికి పదిక్రోసుల దూరంలో ఉన్నది పెద్దవరం. అక్కడ వేంకటేశ్వరుని ఆలయం నిర్మించారు కాని ఏ శాస్త్రీయమైన మూలవిరాట్టు దొరకలేదు. ఆ శిల్పం దొరకటానికి వారు (ఆ గ్రామస్తులు) పడనిపాట్లు లేవు. వెదుకని శిల్ప నిర్మాణ మందిరాలు లేవు. సంప్రదించని శిల్పులు లేరు. అయినా వారి కృషి ఫలించలేదు. కర్ణాకర్ణిగా వారు కృష్ణస్వామిని గురించి విని ఉన్నారు. ఓరుగల్లులో కాకతీయ శిల్ప సాంప్రదాయంలో నిష్ణాతులైన శిల్పులు ఆయనకు పరిచయమే. గ్రామస్తులు నలుగురు పెద్దల్ని ఎంపిక చేసి ఆయన వద్దకు పంపారు.

కృష్ణస్వామి విషయమంతా విన్నారు. వారి ఆసక్తిని మనఃపూర్వకంగా ప్రశంసించారు. తనకు తెలిసిన శ్రీదేవుడనే శిల్పి సశాస్త్రీయంగా మూల విరాట్టును మలచటంలో అత్యంత ప్రజ్ఞావంతుడని చెప్పారు.

గ్రామస్తులు ఎంత వ్యయం అయినా భరించ గలమనీ వెంటనే పిలిపించ వలసిందనీ కోరారు. ఏకశిలానగరానికి వార్త వెళ్ళింది. కాని శ్రీదేవుడు యిప్పుడు అక్కడ లేడట. వాఘిరానదీ తీరంలోనూ, అజంతా గుహల్లోనూ కించిత్తు ఉన్మాదంతో తిరుగుతున్నాడని కబురు వచ్చింది. అయినా కృష్ణస్వామి నిరుత్సాహపడలేదు.

వేగంగా అశ్వాన్ని నడపడంలో అత్యంత నిపుణుడైన ఒక వెలమవీరుణ్ని శ్రీదేవునికొరకు వాఘిరా నదీతీరానికి పంపారు. పంపుతూ ఆ యువకుని చేతికి ఒక తాళపత్రాన్ని యిచ్చారు. దానిమీద ఘంటంతో ముత్యాలవంటి అక్షరాలు చెక్కిఉన్నాయి, ''మహాశిల్పీ ! శ్రీ దేవా ! యీ తెలుగుమాగాణిలో నీ వంటి



మహాశిల్పులకు మమగడ బరువులయిందా! రావయ్యా తెలుగుతల్లి నీ కోసం వాకిలితెరిచింది. వెంకటేశ్వరుని కృపకలిగితే నీవు చరితార్థుడవు కాగలవు. వెంటనే తిరిగిరా! నీ కోసం ఎదురుతెన్నులుచూచే— కృష్ణస్వామి''. కృష్ణస్వామి అందించిన తాళపత్రాన్ని వెలమవీరుడు ఉష్ణీషంలో జాగ్రత్తగా బంధించి ప్రయాణమయ్యాడు. కొద్ది నెలలతర్వాత అతడు శ్రీదేవునితోసహా తిరిగివచ్చాడు. పెద్దవరం గ్రామస్తులకు పెద్ద పండుగే అయ్యింది. కృష్ణస్వామి పర్యవేక్షణలో శ్రీదేవుడు శ్రీ వేంకటేశ్వరుని మూర్తిని మలచటం ప్రారంభించాడు.

శ్రీదేవునిది ఏకాగ్రదృష్టి. రోజులతరబడి అలాగే చూస్తూ ఉండిపోగలడు. అతనిపోగారు మీద సుకుమారమైన సుత్తిదెబ్బలు లయబద్ధంగా పడుతూ వుంటే శ్రావ్యమైనసంగీతం వినిపించినట్లే ఉండేది. గుండె ఝల్లుమనేది.

అతడు శిల్పనిర్మాణంలో లీనమయ్యాక ఏకవీర, లక్ష్మీపద్మా అతనిచుట్టూ చేరేవారు. ఆ నిర్మాణాన్ని అత్యంత ఆసక్తితోచూచి తన్మయులౌతూవుండేవారు. పద్మ విశాలమయిన బెదురుకళ్ళతో శాద్వలాలనుతినటం మరచిచూచేది. లక్ష్మి వెండిమూటలా 'నందిపడక'లో ముంగాళ్ళమీద పండి నెమరువేస్తూ కన్నులు అరమోడ్చిచూచేది. యిక ఏకవీరసంగతి సరే సరి.

నేలకు మూరెత్తున సాగిపోయే చిత్రరసాలం శాఖలమీదకూర్చుని ఊగుతూచూచేది.

మూర్తి పూర్తికావచ్చింది. ఆకృతులు సుక్పతంగా అమరుతున్నాయి. ఏకవీర హృదయంలో ఏదో కదలిక ప్రారంభమయింది. నిలువెత్తు వెంకటేశ్వరునిమూర్తి ఆమె గుప్పెడుగుండెల్లో నిండిపోయాడు. ఆ మూర్తి ఆమె మనసంతా పరుచుకుపోయింది. ఆలోచనలన్నీ ఆయనమీదనే నిలబడిపోయాయి.

ఒక వేకువన కృష్ణస్వామి లేచి ఏకవీరాదేవి ఆలయానికి వెళ్ళుతున్నారు. శ్రీదేవుడు పర్ణశాల

వావడిలో పడుకుని ఉండటం చూచేవవ్వారాయన. వెంకటేశ్వరుని విగ్రహం చాలభాగం పూర్తి అయింది. నడుమునుండి క్రింది భాగాలూ, ధోవతి మడతలూ, పాదాలూ వగైరా మిగిలిపోయివుంది.

యాదాలాపంగా అటుకేసి చూచాడాయన. వెంకటేశ్వరుని పాదాలముందు తదేక దృష్టితో చూస్తూ కూర్చునివున్న ఆకృతి కనిపించింది. ఆ మసక మసక వెలుగులో అది ఎవరయిందీ పోల్చుకో లేకపోయారాయన.

దగ్గరగా వెళ్లిచూస్తే ఏకవీర. తదేకధ్యానంతో చూస్తో తాను మరొక శిల్పంలా కూర్చుని ఉంది.

"అమ్మా ఏకవీరా ! ఏకవీరా !"

"ఊఁ"

"ఏమిటి తల్లీ అంతధ్యాసగా చూస్తున్నావు?"

'తిరుచరణాలను, శ్రీవారి మూర్తిని'

"బాగా నచ్చిందా ?"

"యీ బ్రతుకు నే ఆ స్వామి పాదాలముందు పరచాలనిపిస్తోంది. ఎంతచక్కని కళ్ళు ! ఎంత చల్లని చూపు". ఆమె మాటలు చాల స్వాప్నికంగా ఉండటం గమనించారు కృష్ణస్వామి.

"ఏమిటమ్మా ఆ పరవశం ?"

"స్వామి పరాచికాలకు మనసు పరవశమౌ తోంది."

"స్వామి పరాచికాలా ? నీతోనా."

"ఏమీ ? నేనందుకు తగనా ?"

"మేల్కొనే మాట్లాడుతున్నావా ఏకవీరా ? పలవరిస్తున్నావా."

"పలవరింతలుకావు. పులకరింతలు."

"అమ్మా ! ఏకవీరా ! ఏకవీరా !!"

"నన్ను పలకరించకు తాతా. యీ బ్రతుకు అంతా యీ మాధుర్యాన్ని దూరం చెయ్యకు. మనసు ఉన్నందుకు మనుగడే సార్థకం అయిందయ్యా ! కనులు ఉన్నందుకు కైవల్యమే చేరువ అయిం దయ్యా. యీ పేద జన్మకు యీపాటి పులకింతలు చాలకపోయేనా తాతయ్యా ! నన్నీ స్వామిచెంతనే ఏకాంతంలోనే వదలివెయ్యి. యీ వేకువ కరిగేలోగా వేయి జన్మల పిపాస తీర్చుకో నివ్వు. ఆ మధుర మోహనమయిన రూపాన్ని తుడిచివెయ్యకు" అంటున్నది ఏకవీర.

## తిరుచరణాలు

కృష్ణస్వామికి ఆశ్చర్యంతోపాటు భయమూ సంభ్రమమూ కలిగాయి. సాధారణంగా ఏకవీర పిలిస్తే తప్ప పలుకదు. ఆమె మాటలు క్లుప్తంగా పరిమితంగా ఉండేవి.

కాని, యిదేమిటి ? ఏకవీరకు ఏమయింది. ఈ పులకింతలేమిటి, మాధుర్యాలేమిటి ? ఏకవీర విషయంలో తానేదో పొరపాటు చేసినట్లు కృష్ణస్వామి బాధ పడసాగారు.

"నాకు పూజకు వేళ అయింది. లే తల్లీ. పూలు కోసుకు రావాలి. తులసి దళాలు తుంచుకు రావాలి. లేచి రా అమ్మా."

"ఎక్కడికని రాను తాతయ్యా ! స్వామి నా చేయి విడువడుగా లేచి వొచ్చేందుకు. ఆయనతో ఏడు కొండలు తిరిగాను. ఎంత చూచినా తనివి తీరదయ్యా ఆ రూపం."

"ఏడు కొండలు తిరిగావా ? ఎవరితో."

"నా స్వామితో"

"ఎవరమ్మా నీ స్వామి"

"కొండంత దేముడు. కొండమీది దేముడు. వెంకన్న"

"ఆయన అందరికీ దేముడమ్మా. నీ కోసం వెలిసినవాడు కాడు."

"నా మనసులో చెరగని ముద్ర వేసినాడయ్యా. తరగని రూపం చిత్రించి దొంగలా మాయమై నాడయ్యా."

"నీ కవిత్వంతో నాకు తల తిరుగుతోంది లే తల్లీ" అంటూ ఏకవీర చేయి పుచ్చుకుని లేవదీశా రాయన. ఏకవీర మాతృస్తన్యం నుండి లాగబడుతున్న లేగ దూడలా విలవిల లాడిపోయింది. కొంతసేపటికి ఆమె తేరుకుని తాతగారి ముందు సిగ్గుతో తల వొంచుకుని నిలిచింది.

"అమ్మా ఏకవీరా నీకు ఏమయింది ?" ప్రశ్నించారాయన.

"తాతగారూ నేనుఉన్మాదినిలా ప్రవర్తించానా?"

"లేదమ్మా. నేనలా అనుకోను."

"మనసు మరల్చుకోలేకపోయాను కదూ !"

"ఎప్పటి నుండీ కూర్చున్నావమ్మా స్వామి పాదాల దగ్గర."

"రాత్రి మీకు కందమూలాలు అమర్చి స్వామి దగ్గరకే వెళ్ళాను."

"అయితే రాత్రి అంతా అక్కడే ఉన్నావన్న మాట ?"

"ఏమో ! ఉన్నానేమో !"

"రాత్రి ఎంగిలి పడ్డావా ?" ఏకవీర చివ్వున తలఎత్తి చూసింది.

"అవును తాతయ్యా ! నువ్వు అడిగేది కంద మూలాలు తిన్నావా అని. అవి తిన లేదు కాని నేను ఎంగిలి పడ్డాను. కొండదొర రాత్రి నా కొంగు పట్టేడు. యీ పేదరాలి పెదవులపై ముచ్చటగా ముద్దు పెట్టేడు. నేను అలా ఎంగిలి పడ్డాను" అన్నది ఏకవీర.

పరిస్థితి చాల వరకు వచ్చిందని, ఏకవీర మనసు వశం తప్పతోందనీ గ్రహించాడు కృష్ణస్వామి.

మర్నాడు శ్రీదేవుడు పనిలోకి వచ్చాక కృష్ణస్వామి అతని దగ్గరకు వెళ్ళాడు. శ్రీదేవుడు పనిలో లీనమై ఉన్నాడు. పోగారుమీద సుత్తిదెబ్బలు నుతారంగా పడుతున్నాయి. అది లయబద్ధమయిన మ్రోత. మధురమయిన సంగీతమే !

"శ్రీదేవా ! శ్రీదేవా !" పనికి విఘ్నమైంది. శ్రీదేవుడు తలఎత్తి చూచాడు. ఎదురుగా గురు దేవులు. కృష్ణస్వామి. పోగారు, సుత్తి నేలమీద వుంచి లేచి నిలచాడు శ్రీదేవుడు.

"నాయనా ! మూర్తి పూర్తికావొచ్చిందా ?"

"స్వామి దయ ఉంటే పూర్ణిమనాటికి పూర్తి కావొచ్చు."

"తదియనాటికిమూర్తిని తరలించవొచ్చునా?"

"తొందరపాటు వద్దని మీరేకదా శలవిచ్చారు."

"అవును. అవును. కాని ..." అంటూ అర్థోక్తిలో ఆగిపోయారు కృష్ణస్వామి. విషయ మేమిటో గ్రహించేందుకు శ్రీదేవునికి పూర్వాపరాలు బొత్తిగా తెలియవు.

"నీతో మరొక పని చేయించాలనుకుం టున్నాను."

"మీ ఆజ్ఞ ఎప్పుడూ నాకు శిరోధార్యమే. మరొక శిల్పమేనా ?"

మాస్టారూ! మాకుర్రాడికి ఏవో కొన్ని మార్కులు కలిపేసి పాస్ చేయిం-చొద్దూ!

అమ్మా, అసలు వీడు వచ్చి పరీక్షలు రాసిందెప్పుడూ - మార్కులు కలపడానికి!

# లోకులు ఏమంటారు?

### డా॥ దాశరథి

నాకు మతం లేదంటే — వుందంటారు
నాకు కులం లేదంటే — వుందంటారు
అలా వెళ్ళు అందమైన అంగన మీద
నాకు దృష్టి లేదంటే — వుందంటారు!

నాకు మమత వుందంటే — లేదంటారు
నాకు మనసు వుందంటే — లేదంటారు
ధనం మీద కాదు, మహాజనం మీదనే
నాకు ఆశ వుందంటే — లేదంటారు

"నీ జీవితమంతా శిల్ప నిర్మాణానికే అంకితం చేశావా శ్రీదేవా ?"

"లక్ష్య శుద్ధిని గురించి అనేకమార్లు మీరు ప్రసంగించగా విన్నాను."

"అవును నాయనా ! కాని; ఏకవీర సంకల్పం వేరుగా ఉంది."

"ఏమని ?"

"జీవితమంటే ఆశయాలకు అంకితం కావట మొక్కటే కాదు. అవసరాలకు తలవొంచటం నేర్చు కోవాలి ?"

"స్వామీ నేను వింటున్నది కృష్ణస్వామి ఉపదేశాలేనా ?"

"అవును నాయనా ! నేను జీవితమంతా అవలం బించిన బ్రహ్మచర్యం వల్ల కొన్ని విషయాలు నేర్చు కోగలిగాను. కొన్నివిషయాలు నేర్చుకోలేకపోయాను. మనం మంచి అనుకుంటూ చేసిన పనిలో కొన్ని దోషాలు కూడా ఉంటాయి. చెడు పనిలోనూ కొన్ని సుగుణాలుంటాయి. అవే జీవితంలో ఎదురయ్యే ద్వంద్వాలు."

"మీ మాటలు ఈ మందబుద్ధికి అర్థం కాలేదు."

"అసలు విషయం నేను నీకు సూటిగా చెప్పనేలేదు. నీవు వివాహానికి ఉద్యుక్తుడవు కావాలి నాయనా ?"

"నేనా ? ఈ స్థితిలోనా ?"

"ముందు మూర్తిని సక్రమంగా తీర్చిదిద్దు. ఆ తరువాత."

"మీరు నన్ను ఆలోచించమని ఆదేశించలేదు. ఆజ్ఞాపించారు. కనుక నేను ఆలోచించవలసిందీలేదు, మీ ఆజ్ఞ శిరసా వహిస్తాను" అన్నాడు శ్రీదేవుడు. వధువు ఎవరన్న జిజ్ఞాస అతనికి కలుగలేదు. గురువుగారి ఆజ్ఞ కనుక అవస్యమే తల ఊగించేడు. అతని వినయ సంపదకు అచ్చెరువొందేరు కృష్ణస్వామి.

శిల్పనిర్మాణంలో వేగం హెచ్చింది. మహా మేధావి అయిన కృష్ణస్వామి పర్యవేక్షణా, మహాశిల్పి అయిన శ్రీదేవుని చాతుర్యమూ రెండూ ఆ శిల్పంలో ప్రతిఫలించేయి. చూచేవారు ముగ్ధులే అయ్యారు. పెద్దవరం పౌరులు పొంగిపోయేరు.

పగలంతా శిల్ప నిర్మాణంలో క్షణం తీరిక లేకుండా ఉండిపోయేవాడు శ్రీదేవుడు. రాత్రి అలసి సొలసి నిద్రించేవాడు. కృష్ణస్వామికి కార్యక్రమ మంతా నిర్ణీతంగా ఉండేది. రాత్రి ఝాము ప్రొద్దు గడిచేక ఆయన ఆశ్రమం తలుపులు మూసివేసేవారు. లోపల ఆయన ఏమిచేసేదీ ఎవరికీ తెలియదు. ఇంకా ఝాముప్రొద్దు ఉన్నదనగా తలుపులు తెరుచు కునేవి. ఆ వేళకు ఏకవీర కలయంపి చల్లుతూనో, రంగవల్లికలు తీర్చుతూనో, గోపూజ చేస్తూనో కనిపించేది. కాని ఈ మధ్య ఆమె అలా కనిపించ టం మానివేసింది. రాత్రి కృష్ణస్వామి తలుపులు వేసుకోగానే లక్ష్మిని తోడు తీసుకుని వేంకటేశ్వరుని మూర్తి దగ్గరకు చేరేది. ఆమె స్వామితో ఊహా లోకంలో విహరిస్తూ ఉండేది. లక్ష్మి వెమరువేస్తూ కాలక్షేపం చేసేది.

కృష్ణస్వామి తలుపులు తెరచి ఆలయానికి వెళ్తూ చూస్తే ఆ యిద్దరూ అక్కడే వుండేవారు. కలయంపులు ఆగిపోయాయి. రంగవల్లికలు రంగు మాశాయి. పూజకు పూలు స్వయంగా కోసుకో వలసి వస్తోంది.

అయితే కృష్ణస్వామి ఏకవీర ధ్యానాన్ని భంగ పరచటం మానుకున్నారు. గ్రామస్థులు శిల్పాన్ని తీసుకుని వెళ్లిపోతే ఏకవీర క్రమంగా మారుతుందే తప్ప ఇప్పుడు బలవంతంగా ఆమె మనస్సు మార్చాలని ప్రయత్నం చేయకూడదని ఆయన తలపోశారు.

ఆరోజు రానేవొచ్చింది.

గ్రామస్థులు ఊరేగింపులతో ప్రభలతో తిరునాళ్ళగా వొచ్చిపడ్డారు. వేంకటేశ్వరునిమూర్తిని బండ్లమీదకు ఎక్కించారు. ఊరేగింపు ప్రారంభం అయింది.

ఏకవీర చిన్నబోయిన ముఖంతో ఆ మూర్తినే చూస్తూ బండి వెంట నడుస్తోంది. ఊరేగింపు అయిపోయాక బండ్లు మొగిలిచర్ల గ్రామాన్ని వదలి ప్రయాణం ప్రారంభించాయి. ఆచారం ప్రకారం మొగిలిచర్ల గ్రామస్థులు స్వామిని పొలిమేరవరకు సాగనంపి వెనుదిరిగారు.

పొలిమేరదాటి స్వామి వెళ్ళగానే ఏకవీర కన్నీరు మున్నీరుగా ఏడవటం ప్రారంభించింది.

"ఏమిటమ్మా ఈ పిచ్చి" మందలించారు స్వామి.

"నా స్వామి నాకు దూరమైపోయాడు తాతా"

"ఎక్కడికీపోడమ్మా, కొండంతస్వామి గుండెలో ఉంటాడు"

"నా స్వామి నాకు దూరమైపోయేడు"

"ఏకవీరా ! మనసును నిలువరించుకో తల్లీ"

"పిచ్చిమనసు. పరాధీనమే అయింది"

"ఆడబ్రతుకు ఎప్పుడూ పరాధీనమే తల్లీ" ఆమెమనసు మళ్ళించాలనే ప్రయత్నంలో కృష్ణ స్వామి ఏమో ఏమో మాట్లాడతున్నారు.

"తాతా ! నేనుకూడ పెద్దవరం వెళ్ళి పోతాను".

"ఎందుకు స్వామికోసమేనా ?"

"అవును నా స్వామికోసమే"

"అక్కరలేదమ్మా ! కళ్ళుమూసుకుని చూడు. స్వామి నీలోనే నీకు దర్శనమిస్తాడు. నీకు కావల సింది నీలోనేఉన్నది. వెర్రిలా వెలుపల ఎక్కడో వెతుకవద్దు".

"అవునుతాతా ! నాకు కావలసింది నాలోనే ఉన్నది. నీ వన్నట్లునేనువెర్రినై ఎక్కడెక్కడో వెతికాను. నా స్వామి నా మనసులోనే రూపుకట్టి ఉన్నాడు. ఆ స్వామిని నా నుంచి ఎవరూ వేరుచేయ లేరు". అంటూ ఏదేదో మాట్లాడుతోంది ఏకవీర.

ఆమెను నెమ్మదిగా ఆశ్రమంలోకి చేర్చారు. కాలం జ్ఞాపకాలను చెరిపివేయగలదని కృష్ణస్వామి ఆశ. ఏకవీరవిషయంలో అలా జరగలేదు. మరి కొంత కాలానికైనా అలా జరుగుతుందని ఎదురు చూస్తు న్నారు కృష్ణస్వామి.

మెత్తని శాద్వలాలమీద ఘల్లు ఘల్లుమని మోగుతూవెళ్ళిన సుతిమెత్తనిపాదాలు ఆ ఏకవీరవే. ఆమె తాతగారి ఆదేశంమేరకు మట్టిముంతలో చల్లని నీళ్ళుతెచ్చి నారాయణకు అందించింది. నారాయణ గడగడా త్రాగేసి ఏకవీరనుచూచి ఒక చిరునవ్వు బహూకరించాడు.

ఈ వయోవృద్ధు లిద్దరిమధ్యా నడుస్తున్న సంభాషణ తననుగురించేనన్న అనుమానం ఏకవీరకు రాకపోలేదు. అయితే ఆ విషయం ఆమె పట్టించు కున్నదీకాదు.

ఇంతలో శ్రీదేవుడు అటుకేసి వొచ్చాడు.

"ఏకవీరా నువ్వు ఇక్కడున్నావా ? నీ కోసం తోటంతావెతికాను" అన్నాడు. ఆ మాట వింటూనే ఏకవీరముఖం చిట్లించింది.

"వెళ్ళమ్మా ! శ్రీదేవుడిమనను నొప్పించకు" అంటూ అతనితో ఏకవీరను సాగనంపే ప్రయత్నం లోకి దిగారు కృష్ణస్వామి.

ఏకవీరను వెంటపెట్టుకుని శ్రీదేవుడు అక్కడ నుండి నిష్క్రమించాడు. కృష్ణస్వామి తనను వివాహం చేసుకోవలసిందిగా ఆదేశించినప్పటినుండి అతనిలో కొంత మార్పు రాసాగింది. స్వభావరీత్యా అతడు మంచి భావుకుడు. శిల్పుల కుటుంబంలో పుట్టి పెరిగినవాడు. అతని తండ్రికి మయుడనే

బిరుదు వుండేది. అతడంత అద్భుతమైన శిల్పి. కాకతీయుల శిల్ప సాంప్రదాయరీతులకు అతడు ప్రాణంపోశాడు. గణపతి దేవునిచేత మయుడని పిలిపించుకునేవాడు.

చిన్నతనంనుండీ తండ్రి ప్రక్కనే ఉండి శ్రీదేవుడుకూడ గొప్ప భావుకుడుగా శిల్పిగా రూపొందాడు. సహజంగా భావుకులలో ఉండే పరధ్యానం అతనికీ అలవడింది. సాధారణమైన అందరు సంసారికులకుమల్లే ఆలోచించటం తెలియనివాడు. వేళకు అన్నం తినమని ఎవరైనా చెప్పాలి. కుటుంబం కావాలని, డబ్బు సంపాదించాలనీ తాపత్రయపడటం అసలే తెలియదు. తన శిల్పాలేమో తానేమోగా ఉండేవాడు.

అటువంటి స్వభావానికి చిన్నతనంనుండీ అలవాటుపడి, శ్రీదేవుడు ఒంటరిగానే దేశమంతా తిరిగాడు. ఎన్నో శిల్ప సాంప్రదాయ రీతుల్ని నేర్చాడు. కాని బ్రతుకుతెరువుకు అవసరమయ్యే విషయాల్ని అలక్ష్యం చేశాడు.

ఇప్పటికి నాలుగు పదులు పైబడుతున్నా అతనికి సంసారంలేదు. నా అన్నవాళ్లూ లేరు.

కృష్ణస్వామి ఆశ్రమానికి వచ్చినప్పటినుండీ అతడూ ఒక పనిలో లీనమైవున్నాడు. వేంకటేశ్వరునిమూర్తిని ముగ్ధమోహనంగా తీర్చిదిద్దాడు. అది సజీవరూపమే అనిపించేలా మలిచాడు. ఆ పని పూర్తి అయ్యేవేళకు అతనిలోనిద్రాణమైఉన్న కొన్ని ఆలోచనల్ని ప్రేరేపించారు కృష్ణస్వామి. ఏకవీరను చూచినప్పుడు ఎప్పటిలా తల వొంచుకుని తన ఆలోచనల్లో తాను పడిపోవటంలేదిప్పుడు. ఆమె ముగ్ధత్వం అతనిలో ఆలోచనలను రేపింది. ఆమె లాలిత్యం సౌకుమార్యం అతని హృదయాన్ని పట్టి లాగుతున్నాయి. తనకు తనదంటూ ఏదో కావాలన్న కామన బయలుదేరింది. ఆ కామన కృష్ణస్వామి దోహదాన్ని అందుకుని దినదిన ప్రవృద్ధంగా ఎదిగి మనసంతా నిండిపోయింది.

తోట అంతా తిరుగుతున్నారు. కారణం తెలియదు కాని శ్రీదేవునికి ఇంకా అలానే తిరగాలని పిస్తోంది. ఏకవీర నీలికన్నుల్లో కనిపించే సౌందర్యాన్ని అలాగే తనివితీరా చూడాలనిపించుతోంది. ఆమె శిగలో తోటలో కనిపించిన ప్రతి పువ్వునీ ముడవాలనీ, ఆమె మెత్తని పాదాల క్రింద పడి నలిగి బంగిపోయిన శాద్వలాలను ముద్దాడాలనీ అనిపించుతోంది. ఏకవీరతో పొదరింటిలో కూర్చుని యామముల కొద్దీ ప్రొద్దు పుచ్చాలని అభిలాష మనసంతా నిండుతోంది.

కళ్లు మూసుకున్నా కనిపించేది ఏకవీర రూపమే.

"అబ్బా నేనింకా నడవలేను. కాళ్లు లాగుతున్నాయి" అన్నది ఏకవీర గోరింటపొద ఆనుకుని ఉన్న శిలావేదిక మీద చతికిలపడిపోతూ.

"ఏకవీరా ! ఆ దృశ్యం చూశావా !"

"ఏమిటో అది —?"

"కపోత జంట"

"అవును ముక్కులు పొడుచుకుంటున్నాయి. భలేబాగుంది కదూ ! ఆ దృశ్యాన్ని అలాగే శిల్పంగా మలచలేవూ !"

# తిరుచరణాలు

"ఓ నీవు కోరితే తప్పక చేసియిస్తాను."

"నేను నిన్ను కోరేది వేరే ఉందిలే. మాట తప్పవుగా."

"ఏకవీరాదేవి మీద ఆన"

"శ్రీదేవా ! నాకు నా స్వామిరూపం కావాలి"

"అంటే—"

"నీవు చెక్కావే ! అటువంటిది చిన్నిరూపం కావాలి"

"వేంకటేశ్వరునిదా ?"

"అవును. ఆ స్వామిదే. చెక్కియిస్తావా ?"

"నా నుండి యింత చిన్న కానుకేనా నువ్వు ఆశించేది" ఈ మాటతో ఏకవీర ముఖం చిన్నబుచ్చుకుంది.

"ఇంతలోనే అలుకెందుకు ?" అన్నాడు శ్రీదేవుడు.

"నా స్వామిని చిన్నతనం చేశావు"

"నేనా ? స్వామిని చిన్నతనం చేసేనా. పొరపాటయితే లెంపలేసుకుంటాను. కాని నేను చేసిన పొరపాటు ఏమిటో చెప్పు."

"కొండంత దైవాన్ని కానుకగా యిమ్మంటే చిన్న కానుకే అంటావా ? అతడు కొలిచేవారికి కొంగు బంగారమేనయ్యా. తలుచుకుంటే చాలుకదయ్యా ఆ రూపం బ్రతుకు పండినట్లే."

"ఓ అదా ! ఇంకెప్పుడూ అలా అనములే. ఇదుగో లెంపలు వేసుకుంటున్నాను. నీ స్వామిని నీకు కానుకగా యిస్తే నాకు ఏమి బహుమానం యిస్తావు."

## నా హృదయం !

ప్రియా !
సీసాలో నింపిన
పాదరసం
నీ కోసం పెంచిన
నా హృదయం !
సీసా పగిలెనా
చెల్లాచెదరయ్యేను
పాదరసం !
చేజారిపోయెనా
శకలాలయ్యేను
హృదయం !
చాక చక్య మెంతున్నా
చేర్చలేవు చెదరిన
పాదరసాన్ని,
ఆరాట మెంతున్నా
అతుకలేవు పగిలిన
హృదయాన్ని !
అందుకే అంటున్నా
అతిసుందరం
ఆ పాదరసం !
అతి సున్నితం
నా హృదయం !!

— సోమంచి రామం

"బ్రతుకు పండాలే కాని బహుమానాల కేం కొదువయ్యా."

"అంటే నీ జీవిత సాఫల్యం నీకు దొరికా నా బహుమానం మాట స్వామికే వదిలివేస్తావన్న మాట ?"

"స్వామికన్నా మిన్నగానేనేమి యివ్వగలనయా నీకు. అయినా నీకు ఏమి కావాలో చెప్పు వింటాను."

"ఏకవీరా ! యీ జీవితమంతా యిలాగే నీ నీలి కన్నుల్లోకి చూస్తూ గడిపెయ్యాలని ఉంది."

"ఈ కన్నులు స్వామి చరణాలకు అంకితమైపోయిన కమలాలేనయ్యా."

ఈ సమాధానంతో శ్రీదేవుడు నిశ్చేష్టుడయ్యేను.

"ఏకవీరా ! మనసు స్వామికి పరాధీనం చేశావు. కాని నువ్వు శరీర ధర్మాన్ని తిరస్కరించగలవా ? ఈ శరీరాన్ని స్వామికి అర్పించగలవా ?" అన్నాడు.

"ఎంత అమాయకుడవు శ్రీదేవా నువ్వు. మనసును స్వామికి నేనే అర్పించాను. యీ శరీరాన్ని స్వామి తనంత తానే స్పృశించారు కాదా ! తన క్రీగంటి చూపులతో నా శరీరాన్ని ప్రేమవర్షంలో ముంచెత్తలేదా ! అపాంగైస్పించలే... నీవు తెలుసుకోలేక పోయావా శ్రీదేవా ! యీ సమస్త విశ్వమూ నా స్వామి విసిరే కంటికొన చూపులతో ఆర్ద్రమైపోయింది. నీ వెక్కడున్నావోయి. యీ విశ్వంలో ఒక రేణువు కావా నీవు. నిన్ను నువ్వే మరచావు" అన్నది ఏకవీర. ఆమె స్వాత్విక ధోరణి క్షణక్షణానికి పెరుగుతోంది.

శ్రీదేవునికి యిక తాను అక్కడ ఉండటం కాని ఆమెను అలా ఏకాంతంలో వదలి వెయ్యటం కాని సమంజసం కాదనిపించింది.

"ఏకవీరా ! శిల్పశాలకు వెళ్దామా! నీకు నచ్చిన శిలాఖండాన్ని తీసి యివ్వు. నీ స్వామి రూపం నీ కళ్ళకు కట్టేలా మలచి యిస్తాను. సరా ! వెళ్ళి పోదాం రా !" అంటూ లేచాడు.

ఏకవీర అతని వెంటే శిల్పశాలకు వెళ్ళింది. అక్కడ అనేక శిల్పఖండాలు చిందరవందరగా పడి ఉన్నాయి.

ఏకవీర ఆ శిలాఖండాల మధ్య పిచ్చిదానిలా కూర్చొని వెదుక్కోవటం ప్రారంభించింది. ఒక్కొక్క రాతి ముక్కనూ చేతిలోకి తీసుకుని దాన్ని అనేక భంగిమల్లో చూడటం; నచ్చనట్లుగా దాన్ని విసిరి కొట్టటమూ చేయసాగింది. అలా చాల సేపు గడిచాక ఆమెకు నచ్చిన రాతి ముక్క ఒకటి తీసి శ్రీదేవునికి యిస్తూ అంది,

"నా స్వామి రూపు నా కన్నుల ముందు ప్రత్యక్షం కావాలి. అంత చల్లని చూపు, అంత చక్కని కళ్ళు ఆ రూపంలో తొణికిసలాడాలి. శ్రీదేవా జన్మజన్మలకు నీకు ఋణపడేనయ్యా. నా ప్రాణాలనే నీకు పణంగా చెల్లించేను. నా కోరిక తీర్చు."

శ్రీదేవుడు వెంటనే పని ప్రారంభించాడు. అతని అంగుళ్ళు అత్యంత వేగంతో కదిలి పోగారును నడుపుతూ వుంటే ఆసక్తితో చూడసాగింది ఏకవీర. ఆమె కన్నార్పడమే మరచింది.

[ఇంకా వుంది]

# నాణ్యతా
# లేక
# పొదుపా?



# ఇప్పుడు
# బోనస్ బనియన్‌లో
# రెండూ
# పొందండి.



ఇప్పటి వరకు మీరు ఎప్పుడు మంచి నాణ్యమైన బనియన్ కొనాలనుకొన్నా దాని పైని వెల చూసి కంగారు పడ్డారు. పొదుపు చేయబోయి కొంటే దాని తక్కువ నాణ్యత చూసి బాధపడ్డారు. కాని, బనియన్ లేకుండా గడపలేరు కనుక రెండిటిలో ఏదో ఒకదానితో సరిపెట్టుకొన్నారు.

కాని ఇప్పుడు మీకోసమే వుంది బోనస్-VIP నుండి సూపర్‌ఫైన్ బనియన్. ఇది మొదటిసారిగా మీకు నాణ్యత, పొదుపు–రెండిటినీ ఇస్తుంది.

ఎక్కువ నాణ్యత, తక్కువ వెలకు! ఆశ్చర్యపడ్తారేమో కాని, వాడి చూడండి. మీకే తెలుస్తుంది.



కొత్త

## బోనస్

బనియన్

**ఎక్కువ నాణ్యత**
**తక్కువ వెల**



VIP

AVENUES/HH/B-254

### కె.వి.ఆర్.ఎమ్. — రాజోలు

ప్రతి జీవీ ఎందుకు పుడుతోంది? ఎందుకు జీవిస్తోంది? ఎందుకు మరణిస్తోంది?

★ పుట్టుకతోనే మరణం, మరణం తరువాత పుట్టుక ఇవి జీవికి తప్పని — విషవలయాలని వేదాంతులు అంటూంటారు. ఇలాంటి విషయాలు, మహా మేధావులు చెప్తూంటేనో, బోధిస్తూంటేనో వినాలి. లేదా చదువుకోవాలి — నాలాంటి మిడి మిడి జ్ఞానినడిగితే ఎలాగయ్యా? కొన్ని వేదాంత గ్రంథాలు ఎవరికివారు చదువుకున్నా అర్థంకావు. అవి విశదీకరించి చెప్తూంటే వినాలి. అందుకే అడపా తడపా అక్కడక్కడా ఏర్పాటయ్యే గీతా లెక్చర్సు, అవీ వింటూండాలి. ఒక్క మూఢులే రెలిజియనే నమ్ముతారనుకోనక్కరలేదు. ప్రతిజిజ్ఞాసువూ — యీ జనన మరణం వలయాంగురించి తెలుసుకోవాలన్న కుతూహలం కల్గి వుండడం తప్పు కాదు. ఎప్పుడో కాలేజీ విద్యార్థిగా వున్నప్పుడు; యింకా పెళ్లికూడా కాకముందు నేను చిన్మయ ఉపన్యాసాలు విన్నాను. ఇప్పటికీ నాకవి ఉత్తేజాన్ని కల్గిస్తాయంటే అబద్ధం కాదు. మనంతట మనం చదువుకునేకంటే—వింటూ వుంటేనే వేదాంతసారం—హృద్యమంగా వుంటుంది. మీ ప్రాంతాల పండితులేర్పాట్లు చేసినప్పుడు వినే ప్రయత్నం చేయండి. మూఢనమ్మకాలు పోడానికీ, నిజమైన జ్ఞాన సముపార్జనకీకూడా యిటువంటి అనుభవం అవసరం. అది గ్రహించే పాశ్చాత్య యువత వీటివైపు మొగ్గు చూపుతోంది.

### అవారా — ఖర్గపూరు

మా వీధిలో ఆడవాళ్లు నన్ను వింతగా చూస్తూంటే — లంగా వోణీ అమ్మాయిలాగా నాకు సిగ్గు వేస్తుంది.

★ అదేంఖర్మ? ఆడపేరు తగిలించుకున్న మగ రచయిత్రిలాగా — మీ కిదేంబాధ?!




### యు. కె. ఎస్. — తల్లురాయి

ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే అన్న శ్రీకృష్ణపరమాత్మ ఈ యుగంలో ఏ రూపాన వచ్చాడంటారు?

★ అందరికీ ఒకే రూపంలో రాడయ్యా. కొందరికి ఎన్నికల రూపంలో, కొందరికి ఓటమీ, కొందరికి గెలుపూ రూపంలో ... వస్తూనే వుంటాడు.

### డి. ఆర్. కె; కె. ఆర్. — కోడూరు

కె.రా. గారూ! దేశం చాలా క్లిష్టపరిస్థితిలో వుందంటాను?

★ చిత్తం. డి. ఆర్. కె. గారూ! నేనూ అంతే అనుకుంటున్నాను.

### ఉమ. — కాశీబుగ్గ

'నేనూ, ఆరుద్రగారూ ప్రేమించుకుంటున్నాం' అని ఒక అమ్మాయి చెప్పిందనుకోండి. మీకు ఈర్ష్యగా వుండదా?

★ అయ్యో రామ! మీరెంత అమాయకులండీ? ఆరుద్రగారిలాంటి విషయాల్లో ఛాందసులు!! ఈ కాలం మనిషి కారు. పల్కరించి ఎవతేనా చూస్తే "చూడు రామా, పాపం ఆమె కేం జబ్బో." అని బాధ్యత నాకే అప్పగిస్తారు!

### కె. పి. హెచ్. — పత్తికొండ

అక్కయ్యా, మహాకవీ విప్లవకవీ అయిన శ్రీశ్రీ పై మీ అభిప్రాయం చెపుతారా?

★ ఏం సంగతి. యిలా చాలా మంది అడుగుతున్నారు?! కవిగా గౌరవిస్తాను. వ్యక్తిగా అసహ్యించుకుంటాను. సామాజిక నీతివేరు. వ్యక్తిగత నీతి వేరు. అందుకే వారిపై నాకు సదభిప్రాయం లేదు.

### ఎం. డి. ఎస్. — బైపల్లి

నేటి విద్యావిధానం చాలా దిగజారి పోడానికి కారణం ఏమిటి?

★ ఒక రొకందుకు చదువుదామనుకుంటే, వాళ్ళొకందుకు చెప్పిస్తూంటే — విద్య గురించి ఎవరేనా ఎందుకు పట్టించుకుంటారు?!

### జి ఎమ్ కె — హైదరాబాద్

మానవత్వం అంటే — తనకు మాలిన ధర్మమా?

★ కాదు. అది కీర్తి దాహం అవుతుంది. ఉన్నదాన్లో పంచకల్గడం మానవత్వం. తన కోసం కంటే ఎదుటివారి కోసం ఆలోచించ కల్గడం — మానవత్వానికే మెరుగు పెట్టడం.

### ఎస్. వి. ఆర్ — భినవంత

నా స్నేహితులు కొందరు నా ముందు చాలా మంచిగా వుంటారు గాని వెనుక నాకే దెబ్బతీయాలని అనుకుంటారు ...

★ ఈ రోజుల్లో ఇలాంటి 'స్నేహితులే' ఎక్కువగా కన్పిస్తున్నారు. అంచేత అమాయకత్వం వదిలి బ్రతకనేర్వాలి!

### కె. ఆర్. ఎస్. ఆర్. గోదావరిఖని

నేను బి. ఎస్. సి. చదువుతున్నాను. మొదటి నుంచీ నాకు స్త్రీలంటే ఒక విధమైన గౌరవం. ఎవరేనా అవమానిస్తే మాటలతో బాధపెడితే, అల్లరి చిల్లరి పనులు చేస్తే విపరీతమైన కోపం వస్తుంది. అలాంటి వారిపై చేయి చేసుకోవాలని పిస్తుంది. కాని నేను అశక్తుణ్ణి.

★ దీన్లో అశక్తత లేదు తమ్ముడూ, నీ అభిప్రాయం తెలియచేసి — అటువంటివారికి దూరంగా వుండు. నిజానికి నీలాంటి వారిసంఖ్య ఎక్కువే వున్నా — ఎక్కువగా కన్పించదు. న్యూసెన్సుకి ఉన్న నోరు మంచితనానికి వున్నట్టు కనబడదు కదా?!

### ఎస్.ఎన్.బి. — నెల్లూరు

నేను అమ్మాయిని ప్రేమిస్తున్నాను. లెటరిచ్చి నా అభిప్రాయం ఏమిటంటే మౌనంగా తల వంచుకు వెళ్లిపోయింది. ఆ చూపులకు, ఆ మౌనానికి అర్థం ఏమిటి?

★ ఇది మరీ బాగుంది, నేనా ఆ సీను డైరెక్టు చేశాను?!

### బి. ఎ. పి. — శ్రీకాకుళం

గేయాలు, కవితలు పత్రికలలో ముద్రింపబడాలంటే ఏమి చేయాలో తెల్పప్రార్థన?

★ ఆయా పత్రికా సంపాదకులకు ప్రచురణార్థం పంపి వేచి వుండటమే — దారి. ★

ఇటీవల ప్రొద్దుటూరులో జరిగిన కడపజిల్లా రచయితల ఏడవ మహాసభలో ప్రసంగిస్తున్న ఆహ్వాన సంఘాధ్యక్షులు శ్రీ కె. సుబ్బయ్య. శ్రీ జానమద్ది హనుమచ్ఛాస్త్రి, శ్రీ ఐ. సుబ్బారెడ్డి, శ్రీ పి. శ్రీనివాసరావు, శ్రీ పి. సాంబశివరావుగార్లనికూడా చిత్రంలో చూడవచ్చు.



#  శృంగారాభిలాషలో వివాహిత స్త్రీ! 

ఈ మధ్య జరిగిన శృంగార ప్రపంచ పరిశోధనలో 1983 సం. వివాహిత స్త్రీల సంవత్సరంలా కనిపిస్తోంది. లేడీ హోమ్ జర్నల్ ఫిబ్రవరి సంచిక, ప్లేబాయ్ మార్చి సంచిక, ఫేమిలీ సర్కిల్ జూన్ సంచిక ఇవన్నీ భార్యల మీద సర్వేలు తయారు చేశాయి – శాన్ ఫ్రాన్సిస్కోలోని సైమన్ అండ్ స్కూస్టర్ అనే సంస్థ సెక్స్ అండ్ మేరీడ్ ఉమన్ అనే పుస్తకం ప్రచురిస్తోంది. ఏవో కొన్ని భేదాలు ఉన్నప్పటికీ ఆ సర్వేలో భార్యలు శృంగార పరంగా ఆసక్తి, విశ్వాసం, తృప్తికరంగా ఉన్నట్లు అభివర్ణించాయి.




వివాహంలో శృంగారం గణనీయంగా పెరిగినట్లు ప్లేబాయ్ పత్రిక చెపుతోంది. అలాగే అమెరికా గృహిణి ప్రేమ జీవితం పెంపొందడానికి శృంగార జీవిత ప్రభావం పెంపొందించ దగినదిగా ఉన్నట్లు 'లేడీస్ హోమ్ జర్నల్' చెపుతోంది.

1953 లో ఆల్‌ఫర్డ్ కింగ్‌సే అనే ఆయన వివాహిత స్త్రీల మీద జరిపిన ఒక పరిశోధనలో స్త్రీలలో 6 శాతం నుంచి 26 శాతం వరకు శృంగార ప్రవర్తన ఉంటుందని నిర్ణయించారు. వివాహ సంబంధానికి అదనంగా నువ్వేమైనా ఇతరత్రా కలిగి యున్నావా ? అనే ప్రస్తుత ప్రశ్నకు సమాధానంగా లేడీస్ హోమ్ జర్నల్ 22 శాతం 'ప్లేబాయ్' 34 శాతం 'ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ అడ్వాన్స్‌డ్ స్టడీ ఆఫ్ హ్యూమన్ సెక్సుయాలిటీ' 43 శాతం 'అవును' అని పేర్కొంటున్నాయి.

తమ వివాహాల వల్ల అసంతృప్తి కారణంగా కొందరు దారి తప్పి బహు భర్తృత్వం వచ్చిందని సర్వేలు చెపుతున్నాయి. 50 సంవత్సరాల వయస్సు కలిగిన స్త్రీలలో 65 శాతం శృంగార సంబంధాలు కలిగి ఉంటారని ప్లేబాయ్ వ్రాస్తున్నది.

4/5 వంతు స్త్రీల వివాహాలు సుఖవంతంగా ఉన్నాయట. 3/4 వంతు స్త్రీలు తరచు తమ భర్తలతో ఎంతగా తాము వారిని ప్రేమిస్తున్నది చెప్పుకుంటారట. అలాగే 40 శాతం భర్తలు తమ భార్యలతో ప్రతిరోజు "నిన్ను ప్రేమిస్తున్నాను"అని చెబుతుంటారట.

ఇక శృంగార పరంగా ఆలోచిస్తే ప్లేబాయ్ లెక్క ప్రకారం 80 శాతం, జర్నల్ పత్రిక ప్రకారం 65 శాతం, ఇన్‌స్టిట్యూట్ లెక్కల ప్రకారం 64 శాతం స్త్రీలు గొప్పగా లేక మామూలు కన్నా ఎక్కువగా శృంగారంలో పాల్గొంటూ ఉంటారట. వివాహిత స్త్రీ సగటున వారానికి రెండు సార్లు ప్రేమ కలాపాల్లో పాల్గొంటుందిట.




జర్నల్ జరిపిన సర్వే 60 శాతం స్త్రీలలో క్రమం తప్పకుండా ఉద్రేకం ఉంటుందని, 20 శాతం ఉద్రేకం కొంత తక్కువగా ఉంటుందని, 7 శాతం అసలు ఉద్రేకమే ఉండదని తేలిందట.

ఈ శృంగార సంబంధమైన సర్వేలు నిర్వహించడం వల్ల పత్రిక అమ్మకాలకు దెబ్బ తగలదు. పైగా ఆసక్తి గల పాఠకులకు తమ శృంగార జీవితాలు తగినంత సాధారణంగా ఉన్నాయన్న ఒక హాయిని ఇస్తుందని టైమ్స్




పత్రిక కొరకు సర్వే జరిపిన యాన్‌కెలో విచ్‌స్కెల్లీ అండ్ వైట్ సంస్థ యొక్క సీనియర్ ఉపాధ్యక్షుడు రూత్ క్లార్క్ చెపుతున్నారు.

తాము అనారోగ్యంగా ఉన్నామన్న భయం లేకుండా తాము కోరింది చేయగలరని వారికి హామీ ఇవ్వడానికి సభ్యుల క్షేమం కోసం దాని పాఠకులు కోరుతున్నారని 1975 లో రెడ్ బుక్ నివేదిక ఇచ్చింది. గణాంక లెక్కలని పట్టి ఆరోగ్యానికి ఇది ఒక విధమైన శృంగార చికిత్స అని చెప్పవచ్చు. ★

సీరియల్

# రేపటి ఉదయం

## ప్రతాప రవిశంకర్

**13**

(గత సంచిక తరువాయి)

మామూలుగానే తెల్లవారింది. సూర్యుడు బద్ధకించకుండా ఆ రోజు ఉదయంకూడా తన డ్యూటీకి బయల్దేరాడు.

కాని మేష్టారి కుటుంబసభ్యుల హృదయాలు మాత్రం రోజూలా లేవు... పరిపరివిధాల ఆలోచనలకు గురి అవుతున్నాయి.

మేష్టారు తన శిష్యుడు నిరంజనం పట్నంలో ఉద్యోగం దొరక్క అనుభవిస్తున్న మనఃక్షోభగురించి ఆలోచిస్తున్నాడు.

మేష్టారి భార్య తన మూడో కూతురు సులోచన — తన తమ్ముడి పెళ్ళి గురించి ఆలోచిస్తున్నది — ఆమెకు ఒకవిధంగా కొంత బరువు తీరినట్టు అనిపిస్తున్నది.

పెద్ద కూతురు అనసూయ తన భర్త బలవంతంమీద తండ్రిమీద తను మోపిన భారాన్ని గురించి ఆలోచిస్తున్నది —

రెండో కూతురు సరళ క్రితం రాత్రి తను రహస్యంగా తన కాబోయే జీవిత భాగస్వామి అనుకుంటున్న వేణుగోపాల్ సమక్షంలో ఎన్నో రోజుల తర్వాత పొందిన జీవితంలో మరవలేని సుఖం గురించి ఆలోచిస్తున్నది.

మూడో కూతురు సులోచన తనకు తన మిలట్రీ మామయ్యను చేసుకోవటం ఇష్టంకాదన్న విషయాన్ని ఇంట్లో చెప్పటం ఎలాగ అని ఆలోచిస్తున్నది.

చివరికి ఆమె ఈ విషయాన్ని తన పెద్దక్క అనసూయతో ఎలాగయినా చెప్పాలని నిర్ణయించుకున్నది !

అందుకే భోజనాలయిన తర్వాత ఎవ్వరూ లేకపోవటాన్ని గమనించి "అక్కా... నీతో మాట్లాడాలి" అన్నది చిన్నగా.

"ఏమిటే మాట్లాడేది?" నవ్వుతూ అడిగింది అనసూయ.

"పెళ్ళి గురించి"

"నాకు తెలుసులే... ఇష్టమే అనికదూ."

కాదన్నట్టు తల వూపింది సులోచన.

"ఏమిటి ఇష్టంలేదా ?!" ఆశ్చర్యంగా అడిగింది అనసూయ.

"అవును."

"ఎందుకు ?"

"చెబుతాను... ఇక్కడకాదు... బయటకువెళ్ళి మాట్లాడుకుందాం ?"

అనసూయ తల్లితో తను, సులోచన ఆచార్లుగారింటికి వెళుతున్నట్టు చెప్పి బయటకు బయల్దేరింది.

రోడ్డుమీదకు రాగానే "ఇప్పుడు చెప్పు... రామేశాన్ని చేసుకోవటం ఎందుకిష్టంలేదు నీకు ?"

"నేను, నిరంజనం పెళ్ళి చేసుకోవాలని ఎప్పుడో నిర్ణయించుకున్నాము."

చెల్లెలు చెప్పిన మాట వినగానే నిర్ఘాంతపోయింది అనసూయ.

"నిజమా ?" అన్నది రోడ్డుమీదే ఆగిపోయి.

తల వూపింది.

"మీరిద్దరూ ప్రేమించుకున్నారా ?"

"అవును... అయితే ఈ విషయం ఎవ్వరికీ తెలీదు ..."

"ఈ విషయాన్ని నువ్వు ముందుగానే నాతో ఎందుకు చెప్పలేదు ?"

"ఇప్పుడప్పుడే చెప్పదల్చుకోలేదు. అవసరం వచ్చినప్పుడు చెప్పదల్చుకున్నాను. ఇప్పుడు అవసరం వచ్చింది."

"తీరా రామేశం ఒప్పుకున్న తర్వాత ఇప్పుడు ఈ విషయం చెప్పటం బాగుంటుందా ?"

"బాగున్నా బాగుండకపోయినా. నేను అతన్ని తప్పించి మరో మనిషిని చేసుకోలేను అక్కా ... మేమిద్దరం పెళ్ళి చేసుకోవాలని ఎప్పుడో నిర్ణయించుకున్నాం."

"అతను ఇప్పుడు నిన్ను చేసుకునే పరిస్థితుల్లో ఉన్నాడంటావా ?"

"ప్రస్తుతం లేదు ... ఎప్పుడో ఒక రోజు వెలుగురాక తప్పదు. అతనికి తప్పకుండా ఉద్యోగం వస్తుంది. నన్ను పెళ్ళిచేసుకుంటాడు. ఇది నిజం."

"అమ్మ ఒప్పుకుంటుందా నువ్వు నిరంజనాన్ని చేసుకుంటానంటే" అడిగింది అనసూయ...

"ఒప్పుకున్నా, ఒప్పుకోకపోయినా నా నిర్ణయం మారదు... ఒకవేళ నిరంజనాన్ని చేసుకోవటమే కుదరకపోతే జీవితాంతం ఇలాగే వుండిపోతాను."

చెల్లెలి మొహంలోకి ఆశ్చర్యంగా చూసింది అనసూయ.

"మొత్తానికి నన్ను గొప్ప చిక్కులోనే పడేశావు... సరే కానీ ఏంచేస్తాం ? పెళ్ళి చేసుకునేది నువ్వు. నీ పెళ్ళి నీ యిష్టం ప్రకారమే జరగాలి. బహుశ రామేశం బాధపడతాడేమో," అన్నది అనసూయ.

వాళ్ళు నడుస్తూ వుండగానే ఇద్దరు స్కూలు పిల్లలు పరిగెత్తుకుంటూ వాళ్ళకు ఎదురువచ్చారు. వాళ్ళు అనసూయను, సులోచనను చూడగానే ఆగిపోయి—

"మరే... హెడ్‌మాష్టారు ఉన్నట్టుండి పడిపోయారు... బళ్ళో" అని చెప్పారు.

సులోచన కంగారుగా అక్కయ్యను చూసింది.

"మీరు వెళ్ళి ఇంట్లో చెప్పండి" అని పిల్లలకు చెప్పి "పద మనం స్కూలుకు వెళదాం" అని గబగబా ముందుకు నడిచింది అనసూయ.

ఇద్దరూ స్కూలు దగ్గరకు వెళ్ళేసరికి డాక్టరు పరాంకుశరావు — మేష్టారిని బల్లమీద పడుకోబెట్టి ఇంజెక్షన్ చేస్తూ కనిపించాడు. మిగిలిన మేష్టర్లు ఆయన దగ్గర నిలబడ్డారు.

అనసూయను, సులోచనను చూడగానే "అదృష్టవంతులు మీరంతా... వెంటనే నేను రాబట్టి సరిపోయింది. లేకపోతే ఇప్పుడు వచ్చిన గుండెపోటుకు మేష్టారు మనిందరినీ వదిలివెళ్ళే

---

**జరిగిన కథ — : 4** రంగనాధం మేష్టారు ఆ వూర్లోని బడిలో హెడ్‌మాస్టర్. ఆయన భార్య సత్యవతమ్మ. వీరికి సంతానం నలుగురు కూతుళ్ళు, ఓ కొడుకు. రెండో కూతురు సరళ చిన్నతనంలోనే వైధవ్యం ప్రాప్తించి పుట్టింటికి చేరుతుంది. మూడో కూతురు సులోచన మేష్టారి ప్రియశిష్యుడు నిరంజనంను ప్రేమిస్తుంటుంది. అతను బియ్యే చదివినా ఏ ఉద్యోగం రాక పట్నంలోని ఓ సినిమా హాలులో పనిచేస్తుంటాడు. ఇక ఒక్కగానొక్క కొడుకు కాశీపతి ఇంటర్ నాలుగుసార్లు తప్పి చదువుకు స్వస్తిచెప్పి రోడ్లను సర్వే చేస్తుంటాడు. ఆఖరి కూతురు శశి. మిలటరీలో పనిచేస్తున్న రంగనాధం బామ్మర్ది రామేశం చాలాకాలం తరువాత ఆ ఇంటికి వస్తాడు. కాశీపతి సినిమాహాల్లో గేటుకీపరుగా జేరతాడు. చెరువు దగ్గర వేణుగోపాల్ సరళతో మాట కలుపుతాడు. సులోచనని పెళ్ళి చేసుకోవటాన్కి రామేశం వొప్పుకుంటాడు. కాశీపతి కోటమ్మతో ప్రేమకలాపాలు సాగిస్తుంటాడు. వేణుగోపాల్‌ని నమ్మి తన సర్వస్వాన్ని అర్పిస్తుంది సరళ.

తారు. ఇప్పటికి గండం గడిచినట్టే. అయితే ఇంకోసారి ఇలాంటి స్ట్రోకు వచ్చిందంటే కష్టం..." అన్నాడు డాక్టరు.

భయంగా తండ్రిని చూశారు కూతుళ్లిద్దరూ.

ఇంతలోనే మేష్టారి భార్య, మిగిలిన కుటుంబ సభ్యులందరూ అక్కడికి వచ్చారు. తర్వాత ఎడ్ల బండిమీద మేష్టారిని ఇంటికి తీసుకువెళ్లారు.

## 14

గుండెపోటు దెబ్బనించి మేష్టారు తప్పించుకుని బయట పడినందుకు అందరికీ సంతోషం కలిగింది. కాని వాళ్లందరికీ అటువంటి పోటు ఆయనకు మళ్లీ వస్తుందేమోనన్న భయం పట్టుకుంది. కాని చెయ్యగలిగింది ఏముందని మనసులను సరిపెట్టుకున్నారు.

సులోచనకు రామేశాన్ని చేసుకోవటం ఇష్టం లేదన్న విషయాన్ని ఇంట్లో ఎవ్వరికీ చెప్పలేదు అనసూయ.

"అసలే నాన్న గుండెపోటు వచ్చి ఎట్లాగో బయటపడ్డాడు, ఇప్పుడు నాన్నకు ఈ విషయం తెలిసిందంటే తప్పకుండా బాధపడతాడు. రామేశం నిన్ను చేసుకోటానికి ఒప్పుకోగానే నాన్న ఎంతగానో సంతోషపడ్డాడు. కాబట్టి కొన్నిరోజులు ఈ విషయాన్ని రహస్యంగానే వుంచుదాము. ఈలోపుగా నువ్వు నిరంజనానికి ఒక ఉత్తరం రాయి ఇక్కడి పరిస్థితులను వివరిస్తూ సమయం చూసి నేను అమ్మతో, నాన్నతో మీ ఇద్దరి గురించి చెబుతాను" అన్నది అనసూయ — సులోచనతో ...

సులోచన మాట్లాడలేదు సరేనన్నట్టు తల వూపింది. ఆ రోజునే నిరంజనానికి ఉత్తరం రాసింది. అందులో అతన్ని చూడాలని వుందనీ, ఒక్కసారి రమ్మనీ రాసింది.

ఆరోజు మేష్టారు స్కూలుకు వెళ్లలేదు. ఆయన మామూలుగానే బయల్దేరాడు కాని, భార్య, పిల్లలు ఆయన్ని వెళ్లనివ్వలేదు, విశ్రాంతి తీసుకోమన్నారు.

చేసేదిలేక ఆయన ఇంటిదగ్గిరే వుండిపోయాడు.

సాయంత్రం అవగానే కారియర్ తీసుకుని తన ఉద్యోగానికి వెళ్లిపోయాడు కాశీపతి.

రామేశం మాత్రం ఇంటి దగ్గిరేవున్నాడు పడుకుని. ఎందుకో రామేశం మనసు దిగులు దిగులుగా వుంది. అతనలా దిగులు పడటానికి తగిన కారణం వుంది. ఆ కారణం ఏమిటంటే రామేశానికి ఆడగాలి తగలకపోవటమే.

పల్లెటూరు కదా. తన మీసంచూసి పల్లెటూరి అమ్మాయిలు తనని మోహించి తనమీద పడతారని అనుకుని ఆ వూరు వచ్చాడు రామేశం. కాని అతని ఆశలన్నీ నిలువునా కూలిపోయాయి. ఒక్క ఆడపిల్లా రామేశాన్ని ఎదురుగా చూడలేకపోయింది. అతని మీసాలు చూడగానే ఆడవాళ్లందరూ భయపడి అటూ ఇటూ తప్పుకుని వెళ్లిపోయేవాళ్లు. ఈ విషయం రామేశాన్ని బాగా బాధపెట్టింది. అంతే కాకుండా కాశీపతి ప్రేమలో పడటం. అతను ఆ కోటమ్మతో కలిసి జొన్న చేలలో, పొగాకు తోటల్లో కిందా మీదా పడటం తల్చుకుంటుంటే మరింత ఆవేశం ముంచుకువచ్చి, రామేశం దిగులుపడి పోతున్నాడు.

అందుకే అనసూయ సులోచనను చేసుకోమ్మని అడగ్గానే అభ్యంతరం పెట్టకుండా చేసుకోవటానికి ఒప్పుకున్నాడు. కాని ఆ పెళ్లి ఇప్పుడప్పుడే అయ్యేలా కనిపించలేదు. తను ఒప్పుకున్నా సులోచన తన వెంట తిరిగి తన కోరిక తీర్చేలా కనిపించలేదు. అతనికి ఈ విషయం కూడా బాగానే బాధను కలిగించింది.

చీకటి పడబోతున్నది.

ఎవరి పనుల్లో వాళ్లున్నారు.

బిందె తీసుకుని చెరువుకు బయల్దేరింది సరళ.

సరళ చెరువు దగ్గరకు వెళ్లేసరికి అక్కడ వేణుగోపాల్ నిలబడివున్నాడు. సరళను చూడగానే చిన్నగా నవ్వి "నీ కోసం అరగంటనించీ ఎదురు చూస్తున్నాను" అన్నాడు.

"ఎందుకు ?" చిన్నగా మెట్లు దిగుతూ అడిగింది.

"ఎందుకో నీకు తెలియదూ... మళ్లీ ఆ అన:



భవం కోసం నీ మనసు మాత్రం తహతహలాడటం లేదూ, నిజం చెప్పు.''

సరళకు సిగ్గు ముంచుకు వచ్చింది.

''ఏయ్... సరళా ... ప్లీజ్... ఇవాళ రాత్రి పొద్దుపోయిన తర్వాత మీ ఇంటి వెనక్కు వస్తాను... సిద్ధంగా వుండు.''

''నాకు భయంగా వుంది'' నీళ్లు ముంచుకుని పైకి నవ్వుతూ చిన్నగా అన్నది.

''వచ్చేవరకే భయం ... ఆ తర్వాత అంతా సుఖమే'' అటూ ఇటూ చూసి ఆమె భుజంమీద చెయ్యివేసి నొక్కాడు.

''వదలండి... ఎవరైనా వస్తారు'' అని అతన్ని దాటి గట్టుమీదకు ఎక్కింది సరళ.

''వస్తావు కదూ'' అడిగాడతను వెనుకనించి.

''ఊ ...'' అని గబగబా వెళ్లిపోయింది సరళ.

చిన్నగా హుషారుగా ఈల వేసుకుంటూ తెలుగు సినిమా హీరోలా చీకట్లో కలిసిపోయాడు అతను.

## 15

పరుగులాంటి నడకతో ఇంట్లోకి వచ్చాడు రామేశం ... అతని బట్టలన్నీ చెమటతో తడిసి పోయాయి. అతను ఆయాసంతో రొప్పుతున్నాడు ఉబ్బసం రోగిలా ...

అతని అవతారం చూసి మేష్టారు — ఆయన భార్య పిల్లలందరూ ఆశ్చర్యపోయారు.

''ఏమిటోయ్ రామేశం ? ఏమిటా తొందర ? ఎందుకూ వరిగెత్తుకుంటూ వచ్చావ్ ?'' అని అడిగారు మేష్టారు.

''ఏంలేదు... ఏంలేదు ?'' అన్నాడు రామేశం కంగారుగా.

అలా అన్నవాడు వూరుకోలేదు... వూరుకోకుండా తన బట్టలన్నింటినీ గబగబా పెట్టెలో సర్దుకోవటం మొదలుపెట్టాడు.

రామేశం అలా బట్టలు సర్దుకోవటం అందరికీ ఆశ్చర్యాన్ని కలిగించింది.

''ఒరేయ్ తమ్ముడూ... ఏమిటిరా ఈ అర్థాంతర ప్రయాణం ? అసలు ఏమయ్యింది ?'' అడిగింది మేష్టారి భార్య.

రామేశం జవాబు చెప్పలేదు.

రెండు నిముషాల్లోనే గబగబా బట్టలన్నింటినీ సర్దుకుని మాట్లాడకుండా బయటకువెళ్లి చీకట్లో కలిసిపోయాడు.

అతనలా వెళ్లగానే అందరూ విస్తుబోయారు. అసలు ఏం జరిగి వుంటుందో వాళ్లు వూహించుకోలేకపోయారు.

''ఏం జరిగివుంటుంది ?'' అడిగాడు మేష్టారు భార్యను.

''ఏమో... నాకేంతెలుసు ? నేనూ మీలాగే ఇంట్లోనే వున్నానుకదా...''

''బయట ఎవరితోనైనా గొడవపడ్డాడేమో'' అన్నది అనసూయ.

ఆమె అలా అనగానే బయటనించి ఏదో గొడవ వినిపించింది.

ఎవరో ''మేష్టారూ... మేష్టారూ'' అని గట్టిగా పిల్చారు.

మేష్టారితోపాటు అందరూ బయటకువచ్చారు.



# రేపటి ఉదయం

బయట యాభైమంది మనుషులు నిలబడి వున్నారు. అందులో కొంతమంది దగ్గర లావుపాటి కర్రలు వున్నాయి.

''ఏడీ మీ బావమరిది ?'' ఒకాయన అడిగాడు కోపంగా.

వాళ్ల మధ్యలో ఓ ఇరవైయేళ్ల ఆడది తల వంచుకుని యేడుస్తూ నిలబడివుంది. ఆమె జాకెట్టు రెండు చేతులమీద చినిగిపోయివున్నది. జుట్టంతా రేగిపోయింది.

మేష్టారికి తన బావమరిది రామేశం చేసిన ఘనకార్యమేమిటో అర్థమయిపోయింది.

''ఎక్కడా ఆ మిల్రటీవాడు ?'' ఇంకో మనిషి గర్జించినట్టు అడిగాడు.

''ఇప్పుడే వెళ్లిపోయాడు. ఇంతకీ ఏంచేశాడు అతను ?''

''ఏంచేశాడా ? మన నాగయ్య కూతురు రత్నం పొలం నించి కాలవ గట్టుమీదే వస్తుంటే మీ బావమరిది వెనకనించి వచ్చి దాన్ని జొన్న చేలోకి లాక్కెళ్లి చెరిచాడు.''

మేష్టారు తల వంచుకున్నాడు.

మేష్టారి భార్య మొహాన్ని దించేసుకున్నది.

అనసూయ తన చెల్లెలు సులోచనను చూసింది. సులోచన మొహంలో అక్కయ్యకు తృప్తికనిపించింది.

అతను చేసినది తప్పే అయినా తన బెడద తీరిపోయింది.

''ఇంట్లో వున్నాడేమో వెతకండిరా ?'' ఎవరో అరిచారు ఆవేశంగా.

''లేదు. ఇంతకుముందే బట్టలన్నీ తీసుకుని మాకు చెప్పకుండానే వెళ్లిపోయాడు. కావాలంటే ఇంట్లో వెతుక్కోండి'' అన్నాడు మేష్టారు.

''మీరు చెప్పండి మేష్టారూ... మీ బావమరిది ఇటువంటి వెధవపని చెయ్యటం న్యాయమేనా ?'' ఎవరో అడిగారు.

''నిజమే... రామేశం చేసిన ఈ పనికి నేనెంతో సిగ్గుపడుతున్నాను. ఇందుకు నేను క్షమాపణలు చెప్పుకుంటున్నాను'' అన్నాడు ఆయన.

నిజంగా మేష్టారికి తలకొట్టేసినట్టుగా వుంది. తన బావమరిది తనకు ఇలాంటి అవమానాన్ని కలగజేస్తాడని ఆయన ఎన్నడూ అనుకోలేదు. తన కూతురు సులోచనను చేసుకుంటానని అన్నందుకే తను ఎంతగానో పొంగిపోయాడు. ఇంకా నయం... పెళ్లి చేసెయ్యలేదు. చేస్తే దాని గొంతు కోసినట్టు అయ్యేది.

''పదండిరా... దొరక్క ఎక్కడికి పోతాడు'' అని అక్కడినించి కదిలి వెళ్లిపోయారు.

వాళ్లు వెళ్లగానే ''ఇదీ నీ తమ్ముడి గొప్పతనం...'' అన్నాడు మేష్టారు భార్యతో.

ఆమె మాట్లాడలేదు.

''అయినా ఈ రామేశానికి ఇదేంబుద్ధి ? అసలు ఇందుకోసమే ఈ వూరు వచ్చాడేమో'' అన్నది అనసూయ.

సరళ, సులోచన మౌనంగా నిలబడ్డారు వాళ్ల మాటలు వింటూ.

''ఇంకా నయం... ఈ రామేశం బుద్ధేమిటో మన సులోచన మెళ్లో తాళికట్టకముందే తెలిసింది'' అన్నది అనసూయ.

''వీళ్లంతా ఆ పాపిష్టి వెధవని చంపుతారేమో'' అన్నది మేష్టారి భార్య దిగులుగా.

''నువ్వేం దిగులు పడాల్సిన పనిలేదు. మీ తమ్ముడు మిల్రటీ మనిషి... వీళ్లకి దొరకడు .. పది మైళ్లయినా ఆగకుండా పరిగెత్తగలడు'' అన్నది అనసూయ...

మేష్టారి భార్య మాట్లాడలేదు. తమ్ముడు ఎదురుగా వుంటే ఆమె ఏం చేసేదో ? రామేశం ఆమెకి అవకాశాన్ని ఇవ్వలేదు.

అనసూయ — సులోచన దగ్గరగా వచ్చి ''అదృష్టవంతురాలివే నువ్వు. కాగల కార్యం గంధర్వులు తీర్చారు. ఇప్పటికయినా నువ్వు ఆ నిరంజనానికి ఓ ఉత్తరం రాయటం మంచిది'' చిన్నగా అన్నది.

తల వూపింది సులోచన.

## 16

నెల రోజులు ఎటువంటి విపరీతమయిన సంఘటనలు జరక్కుండానే జరిగిపోయాయి.

ఈ నెల రోజుల్లో మేష్టారి కుటుంబంలోని సభ్యులలో కొంత మందిలో కొన్ని రకాల మార్పులు వచ్చాయి.

సరళకు నెల తప్పింది. అయితే ఇది సరళ అనుమానం మాత్రమే... దాన్ని ఇంకా పూర్తిగా నిర్ధారించుకోలేదు. సరళమీద ఎవ్వరికీ అనుమానం రాలేదు.

వేణుగోపాల్ —సరళను బాగానే కొల్లగొట్టాడు.

ఓ రోజు రాత్రి సరళ — అతన్ని రహస్యంగా ఇంటి వెనుక కలుసుకున్నప్పుడు ''ఇంకెన్ని రోజులు మనం ఇలా రహస్యంగా చీకట్లో కలుసుకోవటం మీరు నన్ను పెళ్లి చేసుకోండి...'' అన్నది.

వేణుగోపాల్ చిరునవ్వు నవ్వాడు.

తర్వాత ''నీ భయం నాకు తెలుసు. నేను నిన్ను మోసం చేస్తాననేగా నీ భయం'' అన్నాడు.

''కాదు.''

''మరేమిటి ?''

''నాకు నెలతప్పినట్టు అనుమానంగా వుంది''

''నిజమా !'' సంతోషంగా అడిగాడు అతను.

''అవును''

''థాంక్యూ సరళా ... నాకెంతో సంతోషకరమైన వార్త చెప్పావు. ఇక మన పెళ్లి విషయంలో నేను ఆలస్యం చెయ్యను. ఇంకో రెండ్రోజుల్లో ఇక్కడినించి వెళ్లిపోతాను. వెళ్లగానే మా వాళ్లకు నీ విషయం చెప్పి వాళ్లు ఒప్పుకున్నా ఒప్పుకోకపోయినా నిన్ను పెళ్లి చేసుకుంటాను'' అన్నాడు ఆవేశంగా.

సరళ మాట్లాడలేదు ...

వేణుగోపాల్ ఆ మరురోజు ఉదయమే వూరికి వెళ్లిపోతాడు. తను ఈ రాత్రికి అతన్ని కలుసుకోవాలి ... రాత్రికోసం ఎదురు చూస్తోంది సరళ ...

ఆమె అలా రాత్రికోసం ఎదురు చూస్తుంటే సులోచన నిరంజనం రాకకోసం ఎదురు చూస్తోంది. ఆమె నిరంజనానికి అన్ని విషయాలనూ వివరంగా రాసింది. కాని ఆమెకు అతన్నించి జవాబు రాలేదు.

జవాబురాదని సులోచనకు తెలుసు. అతను తనకు ఉత్తరం రాయడు.

అతనే వస్తాడు.

**17**

మేష్టారికి ఏమీ అర్థంకాలేదు. ఆయనొక్కడికే కాదు. ఆ కుటుంబంలో ఎవ్వరికీ హఠాత్తుగా కాశీపతి ఎందుకు మాయమయినాడో అంతుబట్టలేదు.

ఆ రోజు సాయంత్రం కాశీపతి థియేటర్‌కి వెళుతూ భోజనం కారియర్ తీసుకువెళ్లలేదు. ఎవరో ఫ్రెండింట్లో భోజనం చేస్తానన్నాడు. అలా వెళ్లిన కాశీపతి ఆ మర్రోజు ఉదయం ఇంటికి రాలేదు. మధ్యాహ్నమయ్యింది. సాయంత్రం కూడా అయ్యింది. ఐనా కాశీపతి ఇంటికి రాలేదు.

పట్నం నించి వచ్చిన మనుషులిద్దరు తమకు కనిపించలేదని చెప్పారు.

ఇక మేష్టారి భార్య ఆదుర్దాకు అంతులేదు.

---

"ఏమయినాడో వాడు" అన్నది కంగారుగా మేష్టారితో.

"భయపడకు ... వాడు తెలివితక్కువ మనిషి కాదు" అన్నాడు మేష్టారు.

అలా అన్నాడేకానీ ఆయనకూ మనసులో భయంగానే వున్నది. ఒకే ఒక్క కొడుకు. వాడు ఇప్పుడు ఉన్నట్టుండి మాయమైపోయాడు.

ఎక్కడికి పోయాడు ఎవరికీ చెప్పకుండా ?

అప్పటికప్పుడే మేష్టారు ఒక మనిషిని కాశీపతి పనిచేస్తున్న థియేటర్‌కి పంపించాడు.

అక్కచెల్లెళ్లందరూ ఒక్క చోట సమావేశమైనారు.

"వీడీమధ్య ఏదో ప్రేమ వ్యవహారంలో పడినట్టు అనుమానంగా వుందే" అన్నది అనసూయ.

సులోచన "ప్రేమా ? వాడి మొహమా ?" అన్నది.

"నువ్వలా అనకే... వాడు మనం అనుకునేటంత అమాయకుడుకాదు. ఈ మధ్య వాడిలో వచ్చిన మార్పును మీరు గమనించలేదనుకుంటాను. నాకెందుకో అనుమానంగా వుంది వీడి అంతర్ధానం" అన్నది మళ్లీ అనసూయ.

"పెద్దగా అరవకే... అమ్మ విన్నదంటే ఇప్పుడు మన ప్రాణం తీస్తుంది" అన్నది సులోచన.

సరళ ఏమీ మాట్లాడలేదు. ఆమె ఆలోచనలన్నీ వేణుగోపాల్ గురించే. ఆ రోజు ఉదయమే వేణుగోపాల్ ఆ వూర్నించి వెళ్లిపోయాడు. ఓ వారం రోజుల్లో తనవాళ్లను పెళ్లికి ఒప్పించి తన దగ్గరకు వస్తానని ప్రమాణంచేసి వెళ్లాడు. తన అనుమానం నిజమే అయ్యింది. తనకు నెలతప్పింది. ఆ రాత్రికూడా వేణుగోపాల్ ఆమె యవ్వనాన్ని కొల్లగొట్టి వెళ్లిపోయాడు. ఈ అనుభవం సరళకు పదేపదే గుర్తుకొస్తోంది.

మేష్టారు పంపించిన మనిషి పట్నంనించి తిరిగి వచ్చాడు. ఆ మనిషికి కాశీపతి కనిపించలేదు.

అతను ఆ రోజు ఉదయం ఎనిమిది గంటలకే థియేటర్‌నించి వెళ్లిపోయాడుట, ఆ తర్వాత అతను ఎవ్వరికీ కనిపించలేదు.

ఈ వార్త వినగానే ఏడుస్తూ పడిపోయింది మేష్టారి భార్య.

మేష్టారిక్కూడా దుఃఖం ఆగలేదు. ఈ మధ్య కాశీపతి థియేటర్లో ఎవరో మనిషితో గొడవపడినట్లు ఆయనకు తెలుసు. ఒకవేళ వాళ్లెవరయినా కాశీపతిని ఏమయినా చేశారేమోనని ఆయన భయం.

"ఏడవకే ! వాడెక్కడో క్షేమంగానేవుంటాడు. ఏడవకు" అన్నాడాయన భార్యను ఓదారుస్తూ.

"మీరిట్లాగే అంటారు. వాడి గురించి మీరు ఎప్పుడు పట్టించుకున్నారు ? అసలు మీకు వాడిమీద ప్రేమ వుంటే కదా...పిచ్చివెధవ...ఏమయ్యాడో... ఎక్కడ వున్నాడో... వాణ్ని మీరు సరిగ్గా చూడకపోవటంతో ఎక్కడికో వెళ్లిపోయి వుంటాడు. ఈ ఇంట్లో అందరికీ ఆ వెధవంటే అలుసే ..." అన్నదామె ఏడుస్తూనే.

మేష్టారికి ఏం మాట్లాడాలో అర్థంకాలేదు. తనకు కాశీపతి అంటే ప్రేమ లేదా ? తను వాడి తండ్రి కాదూ... ఏ తండ్రికి తన కొడుకు మీద ప్రేమ వుండదు ?

భార్య మాటలు మేష్టారిని బాగా బాధపెట్టాయి.

కూతుళ్లందరూ తల్లి దగ్గర చేరారు. ఆమెకు ధైర్యం చెప్పటం మొదలు పెట్టారు. మేష్టారి భార్య వాళ్లని తిట్టింది. వాళ్లు కూడా ఇంట్లో కాశీపతిని సరిగ్గా చూడటం లేదని అన్నది. అయినా వాళ్లేమీ మాట్లాడలేదు.

బాగా రాత్రయ్యింది. ఆ రాత్రి ఆ ఇంట్లో ఎవ్వరూ భోజనాలు చెయ్యలేదు. మేష్టారి భార్య సన్నగా యేడుస్తూనే వున్నది.

రాత్రి పన్నెండున్నర అయింది.

ఆ ఇంట్లో మేష్టారి చిన్న కూతురు శశి మాత్రం నిద్రపోతున్నది. మిగిలిన అందరూ మెలకువగానే వున్నారు.

కాశీపతి మాయంకావటం గురించి తెలిసిన వాళ్లందరూ రాత్రి పదిగంటలదాకా మేష్టారిని పరామర్శించి వెళుతూనే వున్నారు. ఏ స్నేహితుడితోనో కలిసి ఏదో వూరు వెళ్లివుంటాడనీ, తప్పకుండా రాత్రికి తిరిగి వస్తాడనీ మేష్టారికీ ఆయన భార్యకీ ధయిర్యం చెప్పాడు.

అంతటా నిశ్శబ్దంగా వుంది.

ఊరికి దూరంగా స్టేషన్లోకి రైలు వచ్చిన మోత మేష్టారి ఇంట్లో అందరికీ వినిపించింది.

"ఏదయినా వూరెళితే ఈ రైలుకి వస్తాడేమో" అన్నాడు మేష్టారు.

భార్య మాట్లాడలేదు. ఆమెకు బాగా దాహమయ్యింది. రెండు గ్లాసుల నీళ్లు తాగింది.

సులోచనకీ, సరళకీ బాగా ఆకలవుతోంది. అయినా భోజనం చెయ్యాలనిపించలేదు.

ఓ అరగంట గడిచింది.

ఎవరివో అడుగుల చప్పుడు వినిపించి మేష్టారి భార్య, మేష్టారు మంచంమీద లేచి కూర్చున్నారు.

నిమిషం తర్వాత కాశీపతి, పక్కనే మరో అమ్మాయి వరండాలోకి వచ్చారు. కాశీపతి కొత్త బట్టలు వేసుకున్నాడు. ఆమెకూడా కొత్త బట్టలు వేసుకున్నది.

వరండాలో తీగెకు వ్రేలాడుతున్న లాంతరు వెలుతురులో మేష్టారు కాశీపతినీ, పక్కనే నిలబడిన ఆ యువతినీ చూసి శిలాప్రతిమలా అయిపోయాడు.

మేష్టారి భార్య కొయ్యబారిపోయింది.

అనసూయ – సులోచన – సరళ లేచి నిలుచున్నారు.

జరిగిందేమిటో అర్థమయింది.

కాశీపతి మాయమైపోయి చేసిన ఘనకార్యమేమిటో తెలిసిపోయింది.

సరళ చూపులు కాశీపతి పక్కన నిల్చున్న అమ్మాయి మీదే నిలచిపోయాయి. చూస్తూనే గ్రహించింది, ఆ అమ్మాయి కడుపుతో వున్నదని.

వెంటనే ఆమెకు తన విషయం గుర్తుకు వచ్చింది. వేణుగోపాల్ గుర్తుకు వచ్చాడు. తన తమ్ముడు ఆ అమ్మాయిని చేసుకున్నట్టు వేణుగోపాల్ తనని చేసుకుంటాడా ?

మేష్టారు భార్యకేసి చూశాడు. ఆమె తలదించుకుంది ఆయన చూపును అర్థం చేసుకుని.

ఆయన శరీరం చిన్నగా వణుకుతున్నది. కొడుకు చేసిన పనికి ఏంచెయ్యాలో అర్థం కాలేదు.

"ఎవ్వరూ మాట్లాడరేం ?" కాశీపతి అన్నాడు ఆ నిశ్శబ్దాన్ని భరించలేక.

"నువ్వుచేసిన పనికి సిగ్గులేక నీతో మాట్లాడాలా ?" అన్నది మేష్టారి భార్య.

"సిగ్గెందుకు ? నేను, కోటమ్మ ప్రేమించుకున్నాం ... పెళ్లి చేసుకున్నాం" అన్నాడు కాశీపతి గర్వంగా.

కోటమ్మకు అప్పటికే వంటినిండా చెమట పట్టింది. నిజంగా కాశీపతి అంత ధైర్యంగా తనని పెళ్లి చేసుకుంటాడని ఆమె కూడా అనుకోలేదు.

"ప్రేమా ... అసలు నువ్వు మనిషివేనా ? మన వంశ గౌరవం గురించి, పరువు మర్యాదల గురించి ఆలోచించావా ?"

"అవన్నీ నాకు తెలీదు ... మేమిద్దరం పెళ్లి చేసుకోవాలనుకున్నాం. చేసుకున్నాం."

"అయితే దానితోటే ఎక్కడయినా చావు. నువ్వు ఇక ఈ యింటి గడప తొక్కటానికి వీల్లేదు" మేష్టారు ఆవేశంగా అన్నాడు.

"నువ్వెవరు ఈ గడప తొక్కవద్దంటానికి. ఈ ఇంట్లో వుండే హక్కు మా ఇద్దరికీ వుంది" అని, "రా ... కోటమ్మా" అంటూ ముందుకు అడుగు వెయ్యబోయాడు కాశీపతి.

"కాశీపతీ" పెద్దగా అరిచాడు మేష్టారు ముందుకు వస్తూ.

కానీ ఆయన ముందుకు రాలేదు. గుండె పట్టుకుని అక్కడే పడిపోయాడు.

ఆయనకు గుండెపోటు వచ్చింది.

(ఇంకా వుంది)

## ప్రత్యక్ష సాక్ష్యం

'నిజా'నికి
ముందున్న విలువ
తరువాత లేదని,
'అబద్ధా'నికి
ముందుకన్నా విలువ
తరువాతే ఎక్కువని
తెలియజెప్పటానికి –
సజీవ నటుల 'నాటకా'నికి
ముందున్న సీటు రేటు
తరువాత లేకపోవటం,
నిర్జీవ బొమ్మల 'సినీమా'కు
ముందు సీటు కన్నా రేటు
తరువాతే ఎక్కువవటం
కనిపించే ప్రత్యక్షసాక్ష్యం.

– వరాగిత్

# "కాంప్లాన్® మాత్రమే మా కుటుంబానికి సరియైనది–సంపూర్ణంగా ఆరోగ్యబద్ధమైన ఆహారం."



''మా శ్రీవారు పనిలో మునిగి వుంటా
రెప్పుడూ—తరచు భోజనం ఎగ్గొడుతూ
ఉంటారు. ఆయనకు అందని ఆ పోషణని
యిస్తుంది కాంప్లాన్."



''మా అబ్బాయి అన్నం సరిగ్గా తినడు,
మారాం చేస్తాడు. వాడి పెరుగుదలకు కావలసిన
ప్రొటీన్లూ, యితర ఆహార పదార్థాలూ
కాంప్లాన్‌తో తప్పకుండా అందుతాయి ''



"మా అమ్మ యిప్పుడే జబ్బుపడి లేచింది.
ఆకలి లేదు. కోలుకునే యీ సమయంలో,
కాంప్లాన్ ఆదర్శమైన తీరులో
పుష్టినిస్తుందనిపిస్తోంది."

## కేవలం కాంప్లాన్® లోనే అందరికీ అవసరమయ్యే 23 కీలక ఆహార పదార్థాలున్నాయి.



"ఇంట్లో పని చేసిచేసి
అలసిపోతాన్నేను.
మరింత పోషణ
అవసరమనిపిస్తుంది
ఒక్కొక్కప్పుడు.
మరి కాంప్లాన్, నేను మా
కుటుంబానికి
యివ్వగలిగినంత
యిచ్చేలా
చేస్తుందనిపిస్తుంది."

కేవలం కాంప్లాన్‌లోనే శాస్త్రీయంగా రూపొందించిన పాళ్ళలో, మన శరీరానికి ప్రతిరోజూ అవసరమయ్యే 23 కీలక ఆహార పదార్థాలున్నాయి...ప్రొటీన్లు, కార్బొహైడ్రేట్లు, కొవ్వు పదార్థాలు, విటమిన్లు, ఖనిజ పదార్థాలు. డాక్టర్లు ఎక్కువగా సిఫార్సు చేసే ఆరోగ్యబద్ధమైన పానీయం.

రుచికరమైన చాక్లెట్, ఏలక్కాయ–కుంకుమపువ్వు, స్ట్రాబెరీ సువాసనలలో దొరకుతుంది—ప్లెయిన్ (సాదాగా) కూడా.




# కాంప్లాన్®

## —సంపూర్ణంగా ఆరోగ్యబద్ధమైన ఆహారం.

GLC-10-2316 TL (R)

# కొత్తగొంతులు

## టి.యల్. కాంతారావు

ఇప్పటిదాకా ఈ అణువులు
విదరలో, దుమ్ములో
శ్రమలో, రక్తంలో, చెమటలో,
శుశ్రూషలో, బానిసత్వంలో —
దోపిడీలో
ఇప్పుడు మాత్రం
అణు గుండెలు మేల్కొన్నాయి.
కోటి వేల వేల చేతులెత్తి
విప్పే, విప్పే - నలుదెసలా
క్రమ్ముతోంది.
వర్తమానం చెరమదశలో
భవిష్యద్దర్శన మౌతోంది.
ఇనబింబం ఈ జాతి కాదర్శ
మవుతోంది.

— కె. శివారెడ్డి

వచన గేయ కవులలో శివారెడ్డిది ఒక ప్రత్యేకమైన గొంతు. వచన కవిత చెప్పటంలో అతనిదైన ఒక మార్గం ఉన్నది. శివారెడ్డి కవిత్వం చదువుతున్నంతసేపూ పొరపాటునకూడా మరో కవి ఎవ్వడూ గుర్తుకురాకపోవటం శివారెడ్డి ప్రత్యేకత. ఆంగ్లోపన్యాసకుడై తెలుగు కవిత్వాన్ని తెలుగు కవిత్వంగానే, తెలుగు సంప్రదాయంలోనే రాయడం శివారెడ్డి విశేషం. సాహిత్య పత్రికకు సంపాదకుడుగా 'వేకువ' త్రైమాసికను కొంతకాలం నడిపాడు. అంతకు పూర్వం 'భారతి'మాస పత్రికలో అనేక ఆధునిక కావ్యాలపై సమీక్షలు రాసి తన పథాన్ని, దృక్పథాన్ని నిర్ణయించుకున్నాడు. హైదరాబాదు నగర నాగరికతను, అనాగరికతను — భాగ్యాన్ని, దౌర్భాగ్యాన్ని, శిఖరాల్ని, లోయల్ని నిశితంగా పరిశీలించాడు. అక్షరజ్ఞానం లేనివాళ్లకంటే చదువుకున్నవాళ్లే ఈ దేశం ఇట్లా తగలడటానికి కారణమని మనసా వాచా నమ్మాడు. 1971 ఏప్రిల్, జూన్ వేకువ సంపాదకీయంలో తన అభిప్రాయాన్ని చెప్పాడు. "చదువుకున్న వాళ్ల బుర్రల్లోనే మకిలి, మసి నిండుగా ఉన్నాయి. జీవితానికి ప్రపంచ దేశ పరిస్థితులకు వీళ్లు అంధులుగా తయారవటం నేరం. ఇలాంటి నేరస్థులు చదువుకున్నవాళ్లలో ఉన్నంతకాలం కాలం కారుమబ్బే, జీవితం ఇసుకదిబ్బే, రేవు ఊబిగానే మిగిలిపోతోంది." సాహిత్యకారులు, కళాకారులు, మేధావులూ పీడిత మానవజాతికి విముక్తి పథాల్ని చూపించాలని, అట్లా ఉపయోగపడని సాహిత్యం, కళ, మేధ ప్రయోజన రహితమని, కవితా ప్రాంగణంలోకి అడుగుపెట్టిన నాడే గ్రహించాడు శివారెడ్డి.

రక్తం సూర్యుడు, చర్య అనుపత్రి గీతం, నేత్రధనుస్సు కావ్యాల్లో పైభావాల పట్ల అతని నిబద్ధత తీవ్రతరమవుతూ రావటం మనం గమనిస్తాం. నరకబడ్డ వేళ్లు పెరకబడ్డ కాళ్లు, కమిరిపోయిన తలలో, కాలిపోయిన కలలు, దుఃఖపు పగళ్ళు, చీకటి రాత్రులు, శ్రమ నిష్ఫలం, జన్మభారంగా ఉన్న ఈ అసమ సమాజంలో సాంఘిక బాధ్యత కలిగిన కవి ఈనాటి గ్రీష్మంలోంచి, రేపటి వసంతం కోసం, గత కాలపు గాఢాంధకారంలోంచి భవిష్యత్కాలపు కాంతి కోసం, నేత్రాలు సజలాలై, తన్ను తను హరించుకొని, జనం ప్రయోజనం కోసం ఊపిరినే విద్యుత్తుగా మార్చి ఆగమ కాంతి గీతం ఆలపిస్తాడు. ఆ ఆలాపనలో జలం నెత్తురై, విద్యుత్తు పెనుమంటై, వర్తమానం ధ్వసం అవుతున్నప్పుడు భవిష్యత్సమాజ శిశూదయం జరుగుతుంది. దాని కోసమే ఈనాటి కవిత్వమంతా; శివారెడ్డి కవిత్వమూ అంతే, సెలయేటిసి సింబలైజు చేసిన గేయంలో 'మూత పడిన ఈ నీ కళ్ళలో ఈ దేశ సంస్కృతి— హత్య గావించబడ్డ నీలో ఈ దేశ ప్రజాస్వామ్యం— అదర్స్ ఈట్ ఎ ట్రాజిక్ ఏడ్/కిల్లింగ్ మిలియన్స్ ఫర్ ఎ ఫ్యూ' అంటూ ఈ దేశపు ధనస్వామ్య స్వార్థాన్ని, అహంకృతిని, అక్రమాన్ని ధ్వనిస్తాడు. అంతేకాదు ఈ సమాజ గమనంలో రాక్షస పదఘట్టన క్రింద నలుగుతున్న చలి చీమలు, క్రూరమృగాల విచ్చలవిడి విహారానికి ఆహారమవుతున్న అల్పజీవులు, ధనస్వాముల స్కాచ్‌నిషాకి ఆహారమవుతున్న ఘర్మ జలపు నెత్తుటిబొట్లు, దురహంకారానికి, కామాంధతకు, కండబలానికి బలైపోతున్న లేడికూనలు శివారెడ్డి కవిత్వంలో ప్రతి అక్షరంలోను ప్రత్యక్షమవుతాయి. కవిత్వం ఆలోచన ఉన్నవాణ్ణి ఆలోచింపజేస్తుంది. సంతోషమో, దుఃఖమో, ఉద్రేకమో, ఉత్తేజమో కలిగించే శక్తి ఉత్తమ కవిత్వానికి మాత్రమే ఉంటుంది. ఒకడికి కవిత్వమైనది మరొకడికి కవిత్వం కాకుండాపోదు. అతను మనిషైతే



మన జాతి గౌరవం నిలబెట్టడానికి
తరతరాల సంస్కృతి కాపాట్టానికి
కళాకారులూ కామంధులూ భూస్వాములూ
న్యాయస్థానాలూ ఎర్రటోపీలు
శ్రమిస్తూనే ఉన్నాయి-
కానీ నలభై కోట్ల సెలయేళ్ళు హత్యల్లో
ఆసుపత్రుల్లో చెత్తకుండీల్లో మురికి
కాల్వల్లో
ఎంగిలి విస్తరాకుల్లో —
సెలయేళ్ళా సెలయేళ్ళా
మీరిలానే మీరిలానే మీరిలానే
అజ్ఞాతంగా అస్తమిస్తూనే
నిర్భయంగా రమించబడుతూనే —

ఈ పాదాలు చదివితే ఏకకాలంలో కసి, జాలి కలగని పాఠకుడు ఉంటాడని నేననుకోను. అసలది కవిత్వమేనా అని అనుమానించే వాళ్ళకు చెప్పగలిగిందేం లేదు. కవిత్వానికి పెద్ద తూకపురాయి శాస్త్రం కాదు; హృదయం.

శివారెడ్డి కవిత్వంలో సంక్లిష్టతలేదు. చెప్పేది స్పష్టంగానే చెబుతాడు. అక్షరవిలువను, కలయికను జీర్ణించుకొని పదప్రయోగం చెయ్యటంలోగల నేర్పరితనం గొప్పది. కవిత్వరహస్యం కవికేతెలుస్తుందని తిలక్ ఎప్పుడోచెప్పాడు. శివారెడ్డి కవిత్వంలో సూటిదనంకంటె సబ్జెక్టివిటీ ఎక్కువ. అదే అతని కవిత్వానికిబలం. సామాజిక, సాహిత్యపరిణామంలో ఒక్కొక్కదశనే దాటుకుంటూ విప్లవదశకు చేరుకున్నాడు శివారెడ్డి. ఈ సంఘంబట్టి మాటలతో, ఊకదంపుడు ఉపన్యాసాలతో, క్రియారహితమైన సంస్కరణలతో ఎంతమాత్రమూ మారదని అతని విశ్వాసం. వైయ్యక్తిక దుఃఖంఅన్నా, పిరికితనమన్నా అతనికి అసహ్యం. చర్యకు ప్రతిచర్యయే అతనిమార్గం. ఈ ప్రజలమీద, వారు తీసుకువచ్చే విప్లవంమీద, అట్టి విప్లవానికి అభిముఖంగా ఈనాడువస్తున్న కవిత్వంమీద గట్టినమ్మకంగల ఉత్తమ కవి శివారెడ్డి.

"ఇదిరాత్రే
నడిచేటప్పుడు రోడ్డుని ఖూనీచేస్తాడు
మాట్లాడేటప్పుడు మాటని
ఖూనీచేస్తాడు
మేల్కొన్నప్పుడు మెలకువని,
నిద్రపోయేటప్పుడు నిద్రని
పనిచేయించుకుంటున్నప్పుడు
నమ్మకాన్ని ఖూనీచేసినవాడికి
కరెన్సీవాహనం వాహకం —
వాలెంజో నువ్వు కలగన్న
మాస్ నాజనం కావాలి
వీళ్ళంతా సముద్రపొడ్డున నిలబడి
లెమ్మంటే సముద్రమూ లేస్తుంది
విరిగిపడమంటే ఆకాశమూ
విరిగి పడుతుంది. ★






# Hallmark SUPER

## హాల్ మార్క్ సూపర్ జపాన్ వారి సాంకేతిక పరిజ్ఞానముతో చేయబడిన 3 burner స్టెయిన్‌లెస్ స్టీల్ గ్యాస్ స్టవ్.

- శుభ్రపరచుటకు వీలుగా అమర్చబడిన **Removable Stainless Steel Spill Trays.**
- పాత్రలకు స్థిరాధాన్ని చ్చేందుకు **Imported Steel** తో చేయబడిన **Pan supports.**
- మరే ఇతర స్టాండుల అవసరంలేని **Rubber feet.**
- ఇంధనం పొదుపుకై **Specially Designed Burners.**
- స్టౌ వేడి ఎక్కకుండా ప్రత్యేక **Design.**
- భోజన పదార్థములు, పాలు, నీళ్ళు వగైరా వేడిచేసు కొనేందుకు. కాచుకొనేందుకు వీలుగా మూడవ **Burner.**



Manufactured by :
**ORIENTAL APPLIANCES P. LTD.**
Madras 600 013




Marketed by :
**NISCHA-DEEP ENTERPRISES**
8, Victoria Crescent, Egmore,
Madras 600 105 Phone : 811403

6-1-67/19, Saifabad,
Hyderabad 500 004 Phone : 36719

29-4-17, Kothandarama Reddy Road
Arundelpet, Vijayawada 520 002

2, Nanjappa Road
Shanthi Nagar, Bangalore

Sista's NDE 86-82 TE



**Hallmark** గృహ పరికరాలలో - ప్రత్యేక తరహా

# మాయాజాలమే ఒక

## గుడిసేవ సుందరరామయ్య

"ఆనంద్ !" గట్టిగా అరవాలను కొన్నారు రావ్ గారు. కాని గొంతు పెగల్లేదు.

మనసులో ఆవేశం, అవమానం ఒక్కుమ్మడిగా కల్గాయి. ఎంతో కాలం నుంచి కాపాడుకు వస్తున్న ఆత్మాభిమానం దెబ్బతిన్న పులిలా విజృంభించింది.

వయసు తెచ్చిన పెద్దరికం సింహంలా గర్జించింది.

డబ్బు తెచ్చిన దర్పం పాములా బుసకొట్టింది.

కళ్ళు అగ్నిగోళాలయ్యాయి.

ముక్కుపుటాలు రోషంతో ఎగిరెగిరి పడ్డాయి.

ఉద్రేకం, ఉద్వేగం రావ్‌గారి శరీరంలో అణువణువునా వ్యాపించాయి.

కోపంతో పిడికిళ్ళు బిగించి అటు ఇటు పచార్లు చేయసాగారు.

చేతిలోని ఉత్తరం నలిగిపోతూంది !

ఆయన మనసులో అంతులేని సంఘర్షణ.

ప్రతిష్టకు, ప్రేమకు పోరాటం –

అభిమానానికి, అవమానానికి ఘర్షణ –

పెద్దరికానికి, రక్తపాశానికి సమరం –

"ఆనంద్ ..." ఆయన గొంతు వణికింది.

ఈసారి ఆ కంఠంలో కాఠిన్యత లేదు... కరుణ వుంది ! ద్వేషం ధ్వనించలేదు... మమత ప్రతిధ్వనించింది.

ఆయన ముఖంలో అవధులు దాటిన ఆప్యాయత– ఆయన నయనాలలో మూర్తీభవించిన మమకారం – ఆయన శరీరంలో అణువణువునా వెల్లువలా జాలి – అంతలోనే ఎంతో మార్పు ...

ఉప్పెనలా వచ్చిన ఉద్రేకం చటుక్కున మాయమైంది. రక్తపాశం వాస్తవికతా కవ్వంకు చుట్టుకొని మనోసాగరాన్ని మధించింది.

ఆ మధనంలో తొలుత క్రోధం అవతరించినా క్రమేపీ ప్రేమ, అనురాగం, ఆప్యాయత వెలువడ్డాయి. రావ్‌గారి కళ్ళు శ్రావణ మేఘాలయ్యాయి.

'దీని కంతటికీ కారణం నేనే!' అంటూ గొణుక్కున్నారు.

శరీరంలో నిస్సత్తువ ఏర్పడటంతో ప్రక్కనున్న కుర్చీలో అలానే కూర్చుండిపోయారు.

ఆయన మనోతటాకంలో రాయిలా వచ్చిపడిన వుత్తరం ఆలోచనా తరంగాలను సృష్టించింది.

ఆనంద్ ఇలా ప్రవర్తిస్తాడని తను అనుకోలేదు ! తను కన్నకలలన్నీ ఫలించే రోజు దగ్గర్లోనే వుందని మురిసిపోతుండగా తుఫాను లాంటి వార్త.

ఆనంద్ ఎందుకిలా మారిపోయాడు ?

గతాన్ని విస్మరించాడా ?

ఆనాటి ప్రతిజ్ఞలన్నీ ప్రగల్భాలేనా ?

ఇంత కాలం తను పడ్డ శ్రమంతా వృధాయేనా?

సంవత్సరాలు గడిచినా నాటి సంఘటన ఇంకా తన మనోఫలకమ్మీద మెదులుతూనే వుంది.

ఆనాడు ...

భోగిపండుగ –

కళ్ళంలో ధాన్యరాశి వుంది. తన తండ్రి కాపలా వున్నాడు. సాధారణంగా కుప్పనూర్పిళ్ల సమయంలో తన తండ్రే రాత్రిపూట చేలో కాపలావుండేవాడు. తన తండ్రి తెల్లారేసరికి ఇంటికి వస్తే తను చద్దన్నం తిని చేను దగ్గరకు వెళ్లేవాడు. పగలు తను, రాత్రిళ్ళు తన తండ్రి చేను దగ్గరకు వెళ్లటం అలవాటయి పోయింది. ఆరోజు ఎనిమిదయినా తండ్రి ఇంటికి రాకపోయేసరికి తను సైకిలేసుకొని డొంకదారి వెంట బయల్దేరాడు. చేలో జనం కన్పించేసరికి తనకు కంగారెక్కువైంది, సైకిల్‌ను క్రిందపడేసి కళ్ళంలోకి పరిగెత్తాడు తను. తను వెళ్లగానే జనం పక్కకు తప్పుకొన్నారు. తన తండ్రి పొత్తికడుపును పట్టుకొని నేలమీద బాధతో మెలికలు తిరిగి పోతున్నాడు. అరగంటనుంచి అలా బాధ పడుతున్నాడని కూలీలు చెప్పారు. వెంటనే రెండెడ్ల బండిలో ఆయన్ని తమ వూరుకి పదిమైళ్ల దూరంలో వున్న హెల్త్ సెంటర్‌కు తీసుకు వెళ్లటం జరిగింది. తీరా అక్కడకు వెళ్లేసరికి కొత్త డాక్టరింకా జాయిన్ కాలేదన్నారు. తమ దురదృష్టానికి తోడు ఆకాశం మేఘావృతమైంది. సన్నగా ప్రారంభమైన జల్లులు ఉధృతమై కుంభవృష్టిగా మారింది. అతికష్టమ్మీద వానలో తడుస్తూనే రాత్రికి బందరు చేరుకొన్నారు. జనరల్ హాస్పిటల్లో జాయిన్ చేసిన పది నిముషాలకే ఆయన ఈ లోకాన్ని విడిచి వెళ్లిపోయాడు.

ఆయన అపెండిసైటిస్ వలన చనిపోయాడని, వెంటనే వైద్యం చేసివుంటే బ్రతికి వుండేవాడని డాక్టర్లు అన్నారు. అప్పటికి ఆనంద్‌కు ఎనిమిదేళ్ళుంటాయి. ఆరోజు ఆనంద్ ఆవేశంతో పల్కిన మాటలు ఇంకా తన చెవుల్లో మార్మోగుతూనే వున్నాయి... 'నాన్నా! మన వూళ్లో కూడా డాక్టరుంటే తాత చచ్చిపోయేవాడు కాదు కదూ! నేను బాగా చదువుకొని డాక్టరయి యిక్కడే మన వూళ్లో ఆస్పత్రి కట్టిస్తా!' తండ్రి పోయాడన్న దుఃఖం ఓ ప్రక్క మనసును కృంగదీస్తుంటే ఆత్మవిశ్వాసంతో ఆనంద్ పల్కిన మాటలు మరోప్రక్క మనసుకు ఊరట కల్గించాయి.

అనుకొన్న ప్రకారం పగలనక రేయనక కష్టపడి చదివి ఇంటర్ పూర్తి చేశాడు ఆనంద్. మంచి మార్కులు రావటంచేత డొనేషన్ అవసరం లేకుండా మెడిసిన్‌లో సీటు దొరికింది. పెద్దోడు శేషగిరి ఇంటిపట్టునే వుండి తనకు వ్యవసాయంలో సాయం చేసేవాడు. వాడిక్కూడా తమ్ముణ్ణి డాక్టరును చేయాలనే కోరిక వుండేది. కాలగర్భంలో సంవత్సరాలు గడచిపోయాయి. శేషగిరి పెళ్లి రమతో జరిగిపోయింది. ఆనంద్ హౌస్‌సర్జన్‌గా చేస్తుండగా హైద్రాబాద్ నుండి వాడికి ఓ సంబంధం వచ్చింది. అమ్మాయి కూడా డాక్టరేనని, భాగ్యవంతుల బిడ్డని చెప్పారు. పార్వతి ఆ సంబంధానికి ఒప్పుకోలేదు. కలవారి బిడ్డ తమ వాతావరణంలో ఇమడటం కష్టమని ఆనంద్‌కు వేరే-రైతు కుటుంబంలోని పిల్లను చూద్దామంది. శేషగిరి మాత్రం ఎటూ మాట్లాడలేదు. 'వాళ్లిద్దరూ డాక్టర్లు ! బాగా చదువుకొన్నవారు. ఒకరినొకరు అర్థం చేసుకొని సక్రమంగా సంసారం చేసుకొంటారనే నమ్మకం నాకుంది. మనసు మంచిదైతే కలవారైనా పేదవారైనా సమస్యలు రావు. అదీగాక ఆనంద్ కూడా ఆ అమ్మాయిని పెళ్లాడటానికి యిష్టపడుతున్నాడని మధ్యవర్తి చెప్పాడు. వాడిష్టప్రకారమే ఒప్పుకోటం మంచిది' అని తను పార్వతికి నచ్చజెప్పాడు. రమ కూడా తన అభిప్రాయాన్ని బలపర్చింది.

ఆ సంవత్సరమే ఆనంద్ పెళ్లి అనుపమతో జరిగిపోయింది. పెళ్లికాగానే ఆనంద్ హైద్రాబాద్‌లో వుండి ఎమ్. డి. చేయటానికి నిర్ణయించుకొన్నాడు ఏ ఆటంకం లేకుండా వాడు ఎమ్. డి. కూడా పూర్తిచేశాడు. నెల రోజుల క్రితం వాళ్లిద్దరు తమ వూరొచ్చి వారం రోజులుండి వెళ్లారు. అప్పటికి తమ కొత్త భవంతి చాలావరకు పూర్తయింది. గోడలకు ప్లాస్టరింగ్ కూడా అయిపోయింది. ఎటూ మిగిలినదల్లా కరెంటు కనక్షన్. ఆనంద్‌ను తన భవంతి వద్దకు తీసుకు వెళ్లి 'చినబాబూ ! తాతగారు పోయినప్పుడు నీవు అన్న మాటలు గుర్తున్నాయి కదా! కష్టపడి చదువుకొని డాక్టర్ అయ్యావు. నీ కోరిక తీరటానికి నా ప్రయత్నం కూడా నేను చేయాలను కొన్నాను. మన మెట్టపొలం అమ్మేసి ఈ బిల్డింగ్‌ను కట్టించాను. మంచిరోజు చూసి తాతగారి పేరుతో నిర్మించిన ఈ నర్సింగ్‌హోమ్‌ను నీవు ప్రారంభించాలి...' అన్నాడు తను.

'బిల్డింగ్ చాలా బాగుంది నాన్నా !' అన్నాడు వాడు చుట్టూ పరికిస్తూ.

మన దేశంలో మారుమూలలున్న పల్లెటూళ్ళు ఎన్నో ఎంతో అభివృద్ధి చెందుతున్నాయి. అదేమి చిత్రమో కాని ఆనంద్‌కు మెడిసిన్ పూర్తయినా తమ వూరికి హాస్పిటల్ రాలేదు. అది కొంత బాధ కల్గించినా తమ వూళ్లో మొట్టమొదటి డాక్టర్ ఆనంద్ కాబోతున్నందుకు ఎంతో సంతృప్తి కల్గింది...

శాస్త్రిగారిని అడిగి నర్సింగ్‌హోమ్ ప్రారం

భావికి ముహూర్తం పెట్టించి ఆనంద్‌కు ఉత్తరం రాశారు తను.

జవాబుగా ఈ ఉత్తరం ...

హే భగవాన్ ! ఏమిటీ పరీక్ష ?

తన రక్తంలో రక్తం పంచుకు పుట్టిన ఆనంద్ ఎందుకిలా మారిపోయాడు ?

తననెందుకిలా అవమానాలపాలు చేస్తున్నాడు? టేబుల్‌మీద మోచేతులు ఆన్చి రెండు చేతుల్లోను తలదాచుకొని ఎంతోసేపు విలపించారు రావ్‌గారు.

"టీ తెచ్చానండీ !" పార్వతమ్మగారి మాటలు విని చటుక్కున తలెత్తారు.

భర్త ముఖంలో దిగులు, నిరాశ కన్పించగానే పార్వతమ్మగారు ఎంతో ఆందోళన చెందారు.

"ఏం జరిగినదండీ !" అడిగారు ఆత్రంగా టీ కప్పును టేబుల్‌మీద పెడ్తూ.

రావ్‌గారు సమాధానం చెప్పకుండా నేలమీద పడివున్న ఉత్తరాన్ని తీసి అందించారు.

నలిగిపోయిన ఆ ఉత్తరాన్ని చేతి వేళ్ళతో సరిచేసి కంగారుగా చదివారు పార్వతమ్మగారు.

నాన్నగారికి,

ఆనంద్ నమస్కారములు. మీరు వ్రాసిన ఉత్తరం అందినది. అనుపమకు పల్లెటూళ్ళంటే ఎలర్జీ. చిన్నప్పట్నుంచీ సిటీ లైఫ్‌కు అలవాటు పడింది. అదీగాక మామగారు తమ ఇన్‌ఫ్లుయన్స్‌ను వుపయోగించి మా యిద్దర్నీ స్టేట్స్‌కు పంపటానికి నిర్ణయించుకొన్నారు. కాబట్టి మీరనుకొన్నట్లుగా మన వూళ్ళో నేను ప్రాక్టీసు పెట్టలేకపోతున్నాను. మేము వారంరోజుల్లో బొంబే వెళ్తున్నాం. ఈలోపు అమ్మ, మీరు హైద్రాబాద్ రండి. అమ్మకు నమస్కారములు.

మీ
ఆనంద్.

* * *

గోధూళి వేళ ...

పడమటి గాలి పూల పరిమళాలను మోసుకొస్తోంది. ఆకాశంలో రంగు రంగుల పక్షులు రెక్కల శబ్దం చేసుకొంటూ కేరింతలు కొడ్తున్నాయి.

తోటలో మామిడిచెట్టు నీడలో పడక కుర్చీ వేసుకొని పచ్చగా ఏపుగా పెరుగుతున్న మామిడి చెట్టు వైపు పరధ్యానంగా చూస్తున్న రావ్‌గారికి "తాతయ్యా" అన్న పిలుపు విన్పించింది.

ఉలిక్కిపడి చూశారు.

శేషగిరి కూతురు పద్మ పరిగెత్తుకొంటూ వచ్చింది. చేతుల నిండా బురద అంటుకొని వుంది. గౌనుక్కూడా అక్కడక్కడ మట్టి మరకలున్నాయి.

"ఏమిటమ్మా ! ఒళ్ళంతా అలా మట్టి చేసుకొన్నావే ?" అని అడిగారు.

"నేను, రవి చెట్లకు కుదుళ్ళు చేస్తున్నాం తాతయ్యా ! మరేమో ... రవి యిందాకట్నుంచీ ఒకటే యేడుస్తున్నాడు తాతయ్యా ..."

"ఎందుకమ్మ ?" అని అడిగిన రావ్‌గారికి సమాధానం చెప్పకుండా ఆయన చేతిని పుచ్చుకొని తోటలోకి నడిపించుకు వెళ్ళింది పద్మ. మామిడి చెట్టు, పనసచెట్టు ఓ ప్రక్క— బత్తాయి, నిమ్మ మరోప్రక్క—మధ్య మధ్యలో రకరకాల క్రోటన్స్— దారికి అటు ఇటు గులాబీలు. ముద్దమందారాలు, నూరు వరహాలు నవ్వుతూ స్వాగతం పల్కుతున్నాయి. సాయం వీచికలుమోసుకొస్తున్న సుగంధ పరిమళాలు హృదయానికి ఎంతో ఆహ్లాదాన్ని కల్గిస్తున్నాయి. తోటలో అడుగులు వేస్తుంటే ఆ ప్రకృతిలో అణువణువు ఆనంద్‌ను గుర్తు చేస్తున్నాయి రావ్ గారికి. ఈనాడు ఈ తోట ఇలా వర్ధిల్లుతున్నదంటే ఆ క్రెడిట్ అంతా ఆనంద్‌దే ! పచ్చని చెట్లన్నా, రంగుల పూలన్నా ఆనంద్‌కు చాలా యిష్టం ! చిన్నప్పట్నుంచీ వాడికి తోటపని అంటే ఎంతో సరదా ! సరిగ్గా వాడి లక్షణాలే తన మనవరాలికి వచ్చాయి. బడి వదలగానే పద్మ ఓ గంట తోటపని చేస్తుంది. రవి కూడా దానికి సాయం చేస్తాడు. రకరకాల మొక్కలను తెచ్చిపెట్టడానికి వాళ్ళిద్దరూ పోటీ పడతారు వానాకాలం వచ్చిందంటే చాలు శేషగిరితో బందరు నుంచి రకరకాల మొక్కలను, విత్తనాలను తెప్పించి నాటుతారు. అదిగాక వూళ్ళో ఎక్కడైనా కొత్తరకం మొక్కలు కన్పిస్తే వాటిని తీసుకువచ్చి తమ తోటలో నాటేవరకు నిద్రపోరు ...

"అదుగో తాతయ్యా రవి !" అంది పద్మ.






### పి. ఎస్. వి. – రాజమండ్రి

నాకు చాలాసార్లు యూరిన్ వెళ్ళవలసివస్తుంది. గంట, గంటన్నరసేపు పైగా ఆపుచేసుకొంటే కడుపునెప్పి వస్తుంది. రాత్రి 3, 4 సార్లు లేవవలసి వస్తుంది.

★ మీరు యూరిన్ కల్చర్ మూత్రంలో ఆల్బుమన్, షుగర్ పరీక్ష, ఇన్‌ట్రావీనస్, పైలోగ్రామ్, సిస్టోగ్రాం మొదలయిన పరీక్షలు చేయించుకోవలసి ఉంటుంది. ఈ ఫలితాలను శస్త్రవైద్యులకి చూపించండి.

### ఎ.ఎస్.ఆర్. - సిర్‌పూర్ కాగజ్ నగర్

మా అమ్మాయి వయస్సు 40 సం. లు. ఆయాసం, ఒళ్ళంతా వాచి పోవటం, చాలా ఆకలిగా ఉండటం, నిద్ర పట్టక పోవటం, నీరసం మొ॥వి ఉన్నాయి. ఎందుకు ఇలా ఉంటుంది ? ఏమైనా చికిత్స చేయించాలా ? ఆపరేషన్ చేయించాలా ?

★ బ్లడ్ షుగర్, యూరిన్ షుగర్, మొదలయిన పరీక్షలు, బ్లడ్‌ప్రెషర్, ఛాతీ ఎక్స్–రే, ఇ.సి.జి, బ్లడ్ కొలెస్టరాల్ మొదలయిన పరీక్షలు చేసి చూపించండి. రోగ నిర్ధారణ తర్వాత మందులతో తప్పక నయమవుతుంది. శస్త్ర చికిత్స ప్రమేయం లేదు.

### జి. వి. ఎల్. – మచిలీపట్నము

మా చెల్లెలు వయస్సు 20 సంవత్సరములు, ఎప్పుడూ సుద్దముక్కలు తింటుంది. దీనివలన ఏమైనా జబ్బులు వస్తాయా ?

★ మల పరీక్ష చేయించి క్రిములు ఉన్నదీ లేనిదీ పరీక్షించి చికిత్స చేయించండి. మానసిక ఆందోళనవల్ల ఇలా జరిగే అవకాశం ఉంటుంది. మానసిక ఉల్లాసం కలిగించే పరిస్థితుల ప్రాబల్యం వల్ల ఈ లక్షణం పోయే అవకాశం ఉంటుంది. ఇనుప ధాతువులుగల మాత్రలవల్ల (ఫెర్రోలేట్) కొద్దిగా ఫలితం ఉంటుందని నిపుణుల అంచనా.

### జి. పి. ఆర్. – అనంతపూర్

మా పెళ్ళయి 2½ సంవత్సరములు అయినది నా భార్య ప్రతిసారి రెండు నెలలకుపైగా బైట చేరటం నిలిచిపోయి తర్వాత బైట చేరటం జరుగుతుంది. ఇలా ఎందుకు జరుగుతుంది ? గడిచిన కాలంలో నేను వ్యభిచారం ఎక్కువ చేసాను. దానికి, దీనికి ఏమైనా సంబంధం వున్నదా? మాకు పిల్లలు కలగాలంటే మీ వైద్య సలహా తెలుప ప్రార్థన.

★ లేడీ డాక్టర్లవద్ద మీ భార్యను పరీక్ష చేయించండి. మీరుకూడా రక్త పరీక్ష చేయించుకోవటం అవసరం.

మామూలుగా సుఖరోగంవల్ల అబార్షన్ జరగదు. వీర్య పరీక్ష మగవారు చేయించుకోవలసిన ఒకే ఒక పరీక్ష. ముందుగా మీరు ఆ పరీక్ష చేయించుకొని మామూలుగా ఉన్నదని తేలినప్పుడు మీ భార్యను లేడీ డాక్టరువద్ద పరీక్ష చేయించండి.

### టి. వి. ఎల్. – వెంకటపాలెం

నాకు ఎడమ రొమ్ములో గడ్డలాగ లేచింది. పైకేమీ కనిపించదు. ఇది ఒక సంవత్సరముగ వున్నది. అప్పుడప్పుడు కొద్దిగా నెప్పిగా వుంటుంది. ఒళ్ళంతా నెప్పి వచ్చి జ్వరము వచ్చేది. డాక్టర్‌కి చూపిస్తే ప్రమాదమేమీ లేదని మందులు వాడమన్నారు. మందులు వాడినన్ని రోజులు గడ్డ కరిగిపోయినది. మందులు ఆపివేసాక మరల గడ్డ పెరిగినట్లు వున్నది.

★ ఈ గడ్డ ఫైబ్రో ఆడినోమా అయి ఉండవచ్చును. ఈ రకం గడ్డలు రొమ్ము భాగంలో సులువుగా కదలుతూ ఉంటాయి. ఎక్కువ నెప్పి ఉండదు. వీటిని శస్త్రచికిత్స ద్వారా తీసి వేయటం మంచిది. 

---

## వేరుజాతి మొక్క

మాతి పళ్లెం గట్టు మీద కూర్చుని ఏడుస్తున్నాడు రవి.

రావ్‌గారు వెళ్లేసరికి రాగం తారస్థాయిని అందుకొంది.

"ఏం జరిగిందిరా, బాబూ ?" అంటూ ఎత్తుకొని బుజ్జగించారు రావ్‌గారు.

"తాతయ్యా...మరి...నేను పెట్టిన మొక్క... చచ్చిపోయింది ..." అన్నాడు ఏడుస్తూనే.

"రా తాతయ్యా !" అంటూ పద్మ రావ్‌గారిని మొక్కలు నాటిన ప్రదేశానికి తీసుకు వెళ్ళింది.

అక్కడ రెండు జామ మొక్కలు మాత్రం నవనవలాడుతూ పెరుగుతున్నాయి. వాటి ప్రక్కనే ఓ మొక్క వాడలి నేలకు అంటుకుపోయింది.

రవిని క్రిందికి దింపి ఆ మొక్కను పరిశీలనగా చూసి "ఏం మొక్కమ్మా పద్మా ! దీన్ని ఎక్కణ్ణుంచి తెచ్చారు ?" అని అడిగారు రావ్‌గారు.

"రవి, నేను మొన్న మున్నబు గారింటికెళ్లాం తాతయ్యా ! ఇలాంటి మొక్కలు ఆళ్ళింట్లో చాలా వున్నాయి. రవి కావాలంటే ఈ మొక్క యిచ్చారు. నేనేమో రెండు జామ మొక్కలు తెచ్చాను. నేను తెచ్చిన మొక్కలు చక్కగా బతికాయి. కాని వాడు పెట్టిన మొక్క చచ్చిపోయింది.ఎందుకని తాతయ్యా" ప్రశ్నించింది పద్మ.

రావ్‌గారు ఆమొక్కనులాగేసి పరీక్షగాచూశారు.

"ఇదేదో పిచ్చిమొక్కమ్మా !" నవ్వుతూ అన్నారు.

"కాదు తాతయ్యా ! ఆపిల్ మొక్కంట. మున్నబుగారబ్బాయి చెప్పాడు !" రవి అన్నాడు అమాయకంగా.

"ఆపిల్ మొక్కలు మన తోటలో పెరగవు బాబూ !"

"మరెక్కడ పెరుగుతాయి తాతా ?" ఠక్కున ప్రశ్నించింది పద్మ.

"కాశ్మీర్‌లో !"

"అదేమిటి తాతయ్యా ! ఈ తోటలో ఇన్ని మొక్కలు బతికాయి కదా ! మరి ఏపిల్ మొక్క ఎందుకని బతకదు ?"

రావ్‌గారు క్షణం సేపు గతుక్కుమన్నారు.

పద్మ, రవి సమాధానం కొరకు ఆత్రంగా చూడసాగారు.

"మొక్కయినా మనిషయినా పుట్టేది ఈ భూమ్మీదే ! మనుషుల్లో రకరకాల మనస్తత్వాల వాళ్ళు వున్నట్లే మొక్కల్లో కూడా రకరకాల జాతులు వున్నాయమ్మా ! ఒక్కో జాతి మొక్కకు ఒక్కో రకమైన వాతావరణం, వనరులు, పరిసరాలు అవసరమౌతాయి. ఒక మొక్కకు అనుకూలమైన పరిస్థితులు మరో మొక్కకు ప్రతికూలమౌతాయి. ఏ నేలలో బతికే మొక్క ఆ నేలలోనే బతకాలమ్మా !" రావ్‌గారి కంఠం గద్గదమైంది.

"తాతయ్యా ! ఏపిల్ మొక్క మన తోటలో బతకదన్నావు. మరి మన తోటలో బతికే జామి మొక్క కాశ్మీరులో బతుకుతుందా ?"

పద్మ ప్రశ్న వినగానే రావ్‌గారి కళ్ళు అప్రయత్నంగా అశ్రుపూరితాలయ్యాయి.

"బతుకుతుందమ్మా ! తప్పకుండా బతకాలనే ఆ భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాను !" అన్నారు ఆవేశంగా.

అంతకుముందే అక్కడకు వచ్చి మౌనంగా సంభాషణ వింటున్న పార్వతమ్మగారికి భర్త మాటలు వినగానే దుఃఖం ఆగలేదు.

వాళ్లిద్దరు ఎందుకు ఏడుస్తున్నారో పద్మకు అర్థంకాలేదు. కాని రవికి తెల్సు వాళ్ల దుఃఖానికి కారణం !

'పాపం ! ఆపిల్ మొక్క బతకనందుకు అమ్మమ్మ, తాతయ్య ఏడుస్తున్నారు!' అనుకొన్నాడు మనసులో రవి. 

# కళ్లు...









# వాటిలో భావాలొలికించండి

నవ్వు. సంతోషం. కోపం. విచారం. ఈ భావాలన్నిటినీ మీ కళ్లు మరింత ప్రస్ఫుటంగా వ్యక్తం చేయగలవు...శింగార్ డీలక్స్ కాటుకతో. ఇది మరింత నల్లనిది, మరింత నిగనిగలాడేది. ఎంతో చల్లనిది! ప్రత్యేకంగా రూపొందించబడింది, అంచేత కళ్లకు మంట పుట్టించకుండా అందాలన్నీ చిందిస్తుంది.




S

## శింగార్
### డీలక్స్ కాటుక

కళ్లకు మంచిదైన ఒకే ఒక కంటి సౌందర్య సాధనం.

everest/83/SH/179-tl

సీరియల్

# ఆకాశానికి అవతలివైపు

—కేఎస్వీ

## 43

(గత సంచిక తరువాయి)

చాలా సంవత్సరాలుగా చాలా ఫిలిములకి అసిస్టెంటుగా పనిచేసిన కేశవన్ అనే అతను ఇటీవలే డైరెక్టర్ అయ్యాడు. కొత్త ఫార్ములాలతో కొత్త ధోరణిలో సినిమాలు తీస్తూ, మూడో చిత్రం రజతోత్సవ చిత్రం కాగా — అగ్రశ్రేణి దర్శకుడుగా లెక్కలోకి వచ్చేశాడు. తరువాతి చిత్రంలో సుందరిని హీరోయిన్‌గా బుక్ చేశాడు కేశవన్.

అతను చూట్టానికి ఏ మాత్రమూ ఆకర్షణీయంగా ఉండడు, కాని బుర్రనిండా మంచి మంచి ఆలోచనలున్నాయి. ఆ ఆలోచనల్ని కేష్ చేసుకునే చాకచక్యాన్ని కూడా ఇటీవలే అలవరచుకున్నాడు. సినిమా మీద పూర్తి కంట్రోలు ఉండటానికి అతను అవలంబించే సూత్రాలలో మొదటిది — కేవలం అనుభవంలేని కొత్త ప్రొడ్యూసర్లకే పని చెయ్యటం !

"ఈ రోల్‌కి నువ్వు చక్కగా సరిపోతావు. అందుకని బుక్ చేశాను. నీ దగ్గర గ్లామర్ తరిగిపోతోందని కొన్ని పత్రికల్లో రాశారే — అది వట్టిమాట... నానాటికీ నీ అందం కొత్త రేకులు విచ్చుతోంది... అయితే సరిగా దాన్ని ఎక్స్‌ప్లాయిట్ చెయ్యటం అందరికీ చాతకాదనుకో ..."

ఏకాంతంలో తనతో కేశవన్ ఉన్నంత సేపూ వంటిమీద తేళ్ళూ జెర్రులూ పాకుతున్నట్టుగా ఉంది సుందరికి.

కాని గ్లామర్ పడిపోలేదని కేశవన్ అన్నమాట ఆమె చెవుల్లో అమృత తుల్యంగా ప్రతిధ్వనిస్తోంది.

తనను ఇంకాస్త నిలబెట్టి ఇమేజ్ పెంచగలవాడు కేశవన్ అని దృఢంగా నమ్మింది.

ఈసారి సుందరి నమ్మకం వృథాపోలేదు.

కేశవన్ చిత్రం బాక్సాఫీస్ దగ్గర విజయ దుందుభి మోగించింది. ప్రజలూ పత్రికలూ చిత్రాన్ని వేనోళ్ళ శ్లాఘించటం జరిగింది.

సుందరికి కొత్త ఉత్సాహం వచ్చింది.

కేశవన్ దర్శకత్వం వహిస్తున్న తరువాతి మూడు సినిమాల్లోనూ సుందరే హీరోయిన్ అయింది. కేశవన్ మీద ఎక్కడలేని నమ్మకం కుదిరిపోయింది.

ఈలోగా కొన్ని పత్రికలు సుందరి వ్యక్తిగత జీవితం గురించిన కొన్ని కథల్ని ప్రచారంలోకి తెచ్చాయి. శ్యామలరావునుంచి ఆమె విడాకులు తీసుకున్నందుకుగల కారణాలను ఆ పత్రికలు రకరకాలుగా చర్చించాయి.

శ్యామలరావు గురించి ఆ తరువాత సుందరి విన్నది చాలా తక్కువ. ఆంధ్రాలోనే ఎక్కడో ఇల్లు కట్టుకున్నాడని, స్వంతంగా ఏదో బిజినెస్ పెట్టుకున్నాడనీ తెలిసింది. కావలిస్తే ఇంకా ఎక్కువ వివరాలు దొరికేవేగాని, సుందరికి పెద్దగా ఉత్సాహం లేకపోయింది.

కేశవన్ సినిమాల్లోనేకాక ఇంకా వేరే సినిమాల్లో కూడా బుక్ అయింది సుందరి. అయితే, మునుపటి వత్తిడి తగ్గిపోయింది. ఆమె రేటుపెంచేస్తే, వెనక్కి తగ్గుతారు నిర్మాతలు. డబ్బు దగ్గరకూడా మరీ మొండిగా ఉండటానికి వీలులేకుండా ఉంది. కొంచెం తగ్గించినా, కాంట్రాక్టు సైన్ చేస్తూనే ఉంది సుందరి.

## 44

ఇద్దరు హీరోయిన్లున్న ఒక చిత్రంలో వర్ణశ్రీతోబాటు నటించింది సుందరి.

ఆ చిత్రం వందరోజులు నడిచింది.

ఆంధ్రదేశంలో ఒక ఊళ్లో ఒక కొత్త థియేటర్‌లోనూ వందరోజులాడింది అది.

శతదినోత్సవం ఘనంగా జరుగుతుంది గావున యూనిట్‌తోబాటు తారలందరూ రావాలని థియేటర్ యాజమాన్యం పట్టుబట్టింది.

అలా ఆ ఊరెళ్ళింది సుందరి.

శత దినోత్సవం వేడుకలన్నీ ఘనంగా జరిగాయి కాని, అందులో సుందరికి నచ్చనివి కొన్ని ఉన్నాయి. వేదికమీద ప్రముఖులందరూ వర్ణశ్రీ నటన అత్యద్భుతంగా ఉందని పొగడటం, కేవలం మాట వరసకన్నట్టు తన నటనను గురించి ప్రస్తావించటం!

సుందరి భరించలేకపోయిన దృశ్యాలున్నాయి. అవి ఆమె మనసును పూర్తిగా కలచివేశాయి.

వర్ణశ్రీ వేదికమీదికి వచ్చినప్పటినుంచి ప్రేక్షకుల కళ్ళన్నీ ఆమె మీదే ఉన్నాయి. ఆమె నవ్వినా, తల తిప్పినా, పైట సర్దుకున్నా, ఏదో అద్భుతం జరిగిపోతున్నట్టుగా అందరూ హాహాకారాలు చేస్తూ చప్పట్లు చరిచారు.

వర్ణశ్రీ ఉపన్యసించటం మొదలెట్టేసరికి ఆమె 'నిజ కంఠస్వరా'నికి ప్రేక్షకులు తన్మయులైపోయారు.

వచ్చీరాని మాటల్ని కూడదీసుకుంటూ ఆమె ప్రసంగిస్తుంటే, అయిదు సెకన్లకోసారి చప్పట్ల మోతతో హాలంతా ప్రతిధ్వనించిపోయింది.

సుందరి మాట్లాడుతున్నప్పుడూ ప్రేక్షకులు వినకపోలేదు. చప్పట్ల మోత వినిపించకాపోలేదు. కాని, ఇదివరకటి సంచలనాన్ని చూసి కూడా, ఇంకా తన ధోరణిలో తాను ప్రసంగించటం తెలివితక్కువ అని గ్రహించి, క్లుప్తంగా ముగించి కూచునేసింది.

సమావేశం ముగిశాక, థియేటర్ బైటే పడిగాపులు పడి ఉన్న జనం తారల్ని చూడటానికి సముద్ర కెరటాల్లాగా ఎగబడ్డారు.

ఆ పూట ముఖ్య ఆకర్షణ వర్ణశ్రీయే అనిపించింది. ఆమె ఆటోగ్రాఫు కోసం చేతులు ఎగబడ్డాయి. కొన్నిట్లో సంతకాలు చేసి ఆ తరువాత నమస్కారం చేసేసింది వర్ణశ్రీ. జనం గోలచేశారు. పోలీసులు జోక్యం చేసుకుంటున్నారు.

వర్ణశ్రీ దగ్గర ఆటోగ్రాఫు తీసుకున్న ఇద్దరు కుర్రాళ్ళు సుందరిని చూసి "ఒరే — సుందరి కూడా ఉందిరా !" అంటూ ఆమె సంతకం తీసుకున్నారు.

"సుందరి కూడా" అనే మాట బండలా పడింది ఆమె మనసులో.

డిస్ట్రిబ్యూటర్లూ, థియేటర్ యాజమాన్యమూ రాత్రికి డిన్నర్ ఇస్తున్నారు, తిరుగు ప్రయాణం డిన్నర్ తర్వాతే అన్నారు.

లాడ్జిలో చాలా బోరుగా అనిపించింది సుందరికి, ఆ శూన్యం దుర్భరమనిపించింది.

ఎవ్వరికీ చెప్పా పెట్టకుండా బైటకొచ్చి, కార్ స్టార్ట్‌చేసి రోడ్డుమీదికొచ్చింది. అప్పటికి మధ్యాహ్నం మూడున్నర దాటి నాలుగవుతోంది.

ఎండగానే ఉంది. వాతావరణంలో అదోక రకమైన నిర్లిప్తత ఉంది.

చెట్ల నీడలు పరుచుకున్న పొడవాటి రోడ్డు మీద కారు వెళ్తుంటే — ఆ నీడలు తన మనసు మీదే కదులుతున్నట్టు అనిపించింది.

ఇలా ఈ వేళలో ఒంటరిగా తనకు తోచినట్టు ఇష్టం వచ్చినట్టు గడిపి, చాలా కాలమౌతోంది.

ఏవేవో స్మృతులు ముసురుతున్నాయి. గొంతులు

జరిగిన కథ— 10 సుందరి చాలా అందంగా వుంటుంది. ఆ అందమంతా ఆమె కళ్లలోనే ఉందని చూసిన వాళ్లంతా అనుకొంటుంటారు. ఓ ఉత్తరం ద్వారా, ఆ తర్వాత తన అందంతో ఆమెను ఆకట్టుకొంటాడు ఉద్యోగం చేస్తున్న శ్యామలరావ్. పరీక్షలవగానే సుందరి శ్యామలరావ్‌ని పెండ్లి చేసుకుంటుంది. సుందరి శ్యామలరావ్ ప్రోద్బలంతో, దూరపు చుట్టం జగన్మోహన్ సహకారంతో 'సినిమా' లోకంలోకి అడుగు పెడుతుంది. ఆ లోకంలో ఆమెకు రకరకాల అనుభవాలు ఎదురవుతాయి. కానీ అనతికాలంలోనే మంచి పేరు సంపాదించుకుంటుంది సుందరి. ఆ పేరు సంపాదించుకోవడానికి కొన్ని అడ్డదార్లు కూడా తొక్కవలసివస్తుంది. దీనికి కారణంగా శ్యామలరావ్ సుందరిల మధ్య గొడవలు చెలరేగుతాయి. శ్యామలరావ్‌తో తెగతెంపులు చేసుకొంటుంది సుందరి. ప్రేక్షకుల్లో సుందరి ఇమేజ్ తగ్గుతుంది.

వినబడుతున్నాయి, గుండె చప్పుళ్ళు చెవుల్లో వినిపిస్తున్నాయి, ఎందుకు ?

హోరుమని చప్పట్ల మోత వినిపిస్తోంది.

వర్ణశ్రీ నవ్వటం కనిపిస్తోంది.

దండలు, పూలరేకులు, చప్పట్లు.

"సుందరీ ! సుందరీ !–" అంటున్నారు సుందరి చెవిలో ఎవరో.

చిన్న తమాషా చెయ్యాలని బుద్ధి పుట్టింది సుందరికి. వెళ్తూ వెళ్తూ ఒక కూల్‌డ్రింక్ షాపు ముందు కారాపి దిగింది.

దిగుతుండగా ఎవరో ఇద్దరు ముగ్గురు పరిశీలనగా చూశారు.

"సినిమాయాక్టరు – సుందరిలాగుందే ! ..."

"సుందరే ! – సుందరేరోయ్ !..."

షాపులోపల సకల మర్యాదలు లభించాయి. షాపు ఓనరే కూల్‌డ్రింక్ అందించాడు. డబ్బు ఇవ్వబోతేససేమిరా వద్దన్నాడు. థేంక్స్ చెప్పి బైటకొచ్చేసరికి జనం కారును చుట్టుముట్టేశారు. ఇట్లాంటప్పుడు కష్టమే! నిజం చెప్పాలంటే – బైటపడటానికి సాహసం చెయ్యాల్సొస్తుంది. కాని, జనం మూడ్ నిగ్రహించి తప్పుకోవటం సుందరికి బాగా తెలుసు, చేతులు జోడించి, కొద్దిగా వంగుతూ ఆ గుంపుకి నమస్కారం చేసింది. అక్కడ మూగిన కొందరు స్త్రీల భుజాలమీదుగా చేతులేస్తూ ముందుకు నడిచింది. కారుదగ్గిర జనం చెదిరారు, ఆటోగ్రాఫ్ పుస్తకాలు తెచ్చుకుని ఉండకపోవటం చేత, తెల్లకాయితాలమీద సంతకాలు అడిగారు కొందరు. కొన్ని సంతకాలు చేసింది సుందరి. చప్పున వాచీ చూసుకుంది. పక్కనున్న వాళ్ళకి వినిపించేట్టుగా – "అరె... టైమైపోతోందే... ఎలా వెళ్ళటం... వీళ్ళు దారి వదిలేట్టు లేరే !" అంది.

ముందుగా ఉన్న యువకులు నలుగురూ నాయకత్వం వహించి జనాన్ని కంట్రోలు చేశారు. "ఆవిడ వెళ్ళాలిట – పాపం – వెళ్ళనివ్వండి –"

సుందరి కారెక్కి స్టార్ట్‌చేసి, 'టాటా' చెప్తూ చెయ్యూపింది.

జనం గోలగా అరుస్తూ టాటా వీడియోలు చెప్పారు.

'హమ్మయ్య' అనుకుంది సుందరి.

ఆవిడకి లోలోపల చాలా తృప్తిగానే ఉంది. కాని అది కొంతసేపే.

తనెందుకిలా చేసినట్టు ?

జనంలో తనమీద అభిమానం ఇంకా ఏమాత్రం మిగిలుందో తెలుసుకోవాలనే కదూ ?

ఫరవాలేదు. అభిమానం చెప్పుకోదగ్గంత ఉండనే ఉంది. కాని, వెలితి వెలితిగానే ఉంది.

మనసులో సినిమా పోస్టర్‌లో సెక్సీగా డ్రెస్ చేసుకుని హొయలొలకబోస్తోంది వర్ణశ్రీ.

కూల్‌డ్రింక్ షాపుదగ్గిర తనతోబాటు వర్ణశ్రీ కూడా ఉండిఉంటే ఎలా ఉండేది ? జనం ఎక్కువగా ఆవిడచుట్టే మూగేవారు కాబోలు. అప్పుడు – "సుందరికూడా" ఉందని గుర్తించేవారేమో !

కొంచెం ఊరికి దూరంగా వెళ్దామని కారు దారి మళ్ళించబోతూ మలుపులో ఉలిక్కిపడింది సుందరి.

కారు ఒక వ్యక్తిని దాటి వెళ్ళింది. అతణ్ణి ఇదివరకు ఎక్కడో ఎరిగున్నట్టు అనిపించింది. అనాలోచితంగానే కారు ఆపి, రివర్స్ చేసుకు వెళ్ళింది సుందరి.

వ్యూఫైండర్‌లో ఆ వ్యక్తి ప్రతిబింబం అంతకంతకూ దగ్గరైంది.

కారు వెనక్కి వెనక్కే వస్తూండటం చూసి, నడుస్తున్న ఆ వ్యక్తి తలెత్తాడు.

క్షణంలో సగంలోనే పోల్చుకోగలిగింది సుందరి.

ఆ వ్యక్తి — సుమంత్ !

## 45

అతను మాత్రం సుందరిని అంత చప్పున పోల్చుకున్నట్టు లేదు. కళ్ళు చికిలించి చూశాడు, "ఓ !..." అన్నాడు.

"సుమంత్ !..."

"సుందరీ !— మీరు..."

రెండు మూడు క్షణాలు మాటలు నడవలేదు.

అటుగా వెళ్తున్న ఒకరిద్దరు కారు వంకా తన వంకా సుమంత్ వంకా మార్చి మార్చి చూడటం గమనించింది సుందరి. అప్పుడే ఆమె బుర్ర పని చెయ్యటం మొదలెట్టింది. వంగి, కారు డోర్ తెరుస్తూ – "కమాన్– కారెక్కు –" అంది.

"సుందరీ – ఎలా ఉన్నావ్ ?–" అప్పుడే నవ్వు వచ్చింది సుమంత్ పెదవుల మీదికి.

సుందరి కూచున్న వేపు, రోడ్డుమీద ముగ్గురు ఆగారు. "సినిమా స్టారు – సుందరి కదూ ?–"

"అవును – సుందరే !–"



## అందానికి అవతలివైపు

వాళ్ళ వంక అసహనంగా చూసి, సుమంత్‌ని కళ్ళతోటే ప్రార్థించింది సుందరి —

"ప్లీజ్ — గెటిన్...ఇంకో నిమిషం ఇక్కడుంటే ప్రమాదం —"

"ఎక్కడికీ ?—"

"ప్లీజ్ !— గెటిన్ —"

గమ్మున ఎక్కి కూచున్నాడు సుమంత్.

"సుందరి ఆగాలి ! – సుందరి..."

జనంలో ఎవరో కేకలు వెయ్యటం మొదలెట్టారు.

కారు దూసుకుపోయింది. మలుపులు తిరిగింది.

"ఎలా వెళ్ళాం ?... ఈ వూరు నాకు తెలీదు... మనం కాసేపు ఫ్రీగా గడపాలి..."

సంవత్సరాల తర్వాత సుమంత్‌ను చూసిన ఆశ్చర్యం నుంచి సుందరి కొంచెం తొందరగానే కోలుకుంది. లోపల ఏదో పెద్ద దుమారం చెలరేగుతున్నా, పైకి మాత్రం మామూలుగా కనిపిస్తూ మామూలుగా మాట్లాడాలని ప్రయత్నిస్తోంది.

"చెప్పు సుమంత్ – ఎటు వెళ్దాం ?..."

"ఇలాగ వెళ్తున్నాంగా... చాలదూ ? లేకుంటే – ఏదైనా హోటల్‌కెళ్ళి కూచుందాం... కాని మీరు మళ్ళీ ప్రమాదంలో పడతారు, పోనీ – మా ఇంటికి వెళ్దామా ?..."

"చివర చెప్పావే... అది మొదటే చెప్పి ఉంటే వచ్చి ఉండేదాన్ని... పోనీ... ఇలా వెళ్తూ మాట్లాడుకుందాంలే... ఇదీ బాగానే ఉంది..." బిల్డింగ్స్ అన్నీ పలచబడుతూ ఉండగా, ఊరవతలకి చేరింది కారు.

"స్ట్రెయిట్‌గా వెళ్ళండి – అక్కడ రైట్‌లో మట్టిరోడ్డుమీద వెళ్తే దొంగల మంటపం వస్తుంది –" అన్నాడు సుమంత్.

అతను చెప్పినట్టే, మట్టిరోడ్డుమీదికి కారును మళ్ళిస్తూ – "దొంగల మంటపమేంటి ?" అంది సుందరి.

"అబ్బె... ఇప్పుడేం భయపడాల్సిన పనిలేదు. మునుపెప్పుడో... ఊళ్ళో పడే దొంగలు ఇక్కడికొచ్చి కూచుని దొంగసొత్తులు పంచుకునేవాళ్ళని ప్రతీతి..."

"ఇక్కడ ఇదొకటుందని నీకెలా తెలుసూ?..."

"ఎప్పుడైనా – ఏమీ తోచనప్పుడు – ఇక్కడికొచ్చి – మంటపంలో కాస్సేపు కూచుని వెళ్తాను. మనుషుల డిస్టర్బెన్స్ అట్టే ఉండదు. ప్రశాంతంగా ఉంటుంది..."

"రైటే – నువ్వన్నది –" మంటపం వారగా కారు పార్కుచేస్తూ – చుట్టూ కలయజూసింది సుందరి.

చుట్టూ చెట్లు గుబురు గుబురుగా పచ్చగా ఉన్నాయి.

ఆ వెనుక ఎక్కణ్ణుంచో పేరు తెలియని పిట్ట ఏదో – అప్పుడే సన్నగా పలికింది.

"రియలీ – దిస్‌జె లవ్‌లీ ప్లేస్ ..." అంది సుందరి హాయిగా ఊపిరి పీల్చుకుంటూ.

మంటపంలో కూచుని ఒక స్తంభానికి ఆనుకున్నాడు సుమంత్. ఏమీ మాట్లాడకుండా







క్షణం సేపు సుందరికేసి రెప్పవాల్చకుండా చూశాడు. ఆ తరువాత నవ్వాడు.

"ఎందుకు నవ్వుతావూ ?" అంది సుందరి, దగ్గరికెళ్ళి — అతని కెదురుగా కూచుంటూ.

"ఏమీ లేదు —"

"ఏమీ లేనప్పుడు — నవ్వకూడదు ! మూతి బిగించుకోవాలి !"

కలుసుకుని చాలా రోజులైనా, ఇద్దరి మధ్యా మాటలు చాలా అప్రయత్నంగా దొర్లిపోతున్నాయి.

"ఇక చెప్పు సుమంత్ ! అయితే నీ ఆవిణ్ణి నాకు చూపించనన్నమాట" అంది సుందరి.

"చూడాలనుందా నీకు ? నిజంగా ?"

"ఎంతగా లేదూ సుమంత్ ? నేనేమో నిన్ను నిన్నని అంటున్నాను. నువ్వు నన్ను మీరంటున్నావు. నిజం ! నీ ఆవిణ్ణి చూడాలని ఉంది."

"మొదటే ఆ మాట అని ఉంటే — నిమ్మల్ని మొహమాటపెట్టి అయినా ఇంటికి తీసుకెళ్ళేవాణ్ణి" క్రుంకుతున్న సూర్యుడి ఆఖరు వెలుగులు, పలచబారుతున్న సుమంత్ జుత్తుమీద మెరుస్తున్నాయి.

కొద్దిగా లావెక్కాడు సుమంత్. నడివయసు లక్షణాల వెనుక, ముఖంలో ఏదో బాల్య స్నేహాలాంటి స్వచ్ఛత దోబూచులాడుతోంది.

"అయితే నువ్వు నన్ను 'నువ్వు' అనవా ?"

"ఏంటి సుందరీ ! చిన్న పిల్లల్లాగా ! సరేలే— ఇక చెప్పు."

"ఈ వూరికి శత దినోత్సవానికని వచ్చాను. చిత్రం సుమా ... హఠాత్తుగా బైటపడాలనిపించి— కారేసుకుని వచ్చేశా ... నువ్వు కనిపించావు ... ఎన్నాళ్ళకి ! పల్లవి ఎక్కడుంది ?"

"కడపలో ఉంది. నీకెప్పుడో ఉత్తరం రాసిందట — నీ నుంచి జవాబు రాలేదుట ... ఉత్తరం నీ చేతికి వచ్చి వుండదేమోనని నేనే అన్నాలే ... నువ్వు బాగా ఆక్ట్ చేస్తావుట ... మా ఆవిడకి నీ సినిమాలు ఇష్టంలే...నీ ఫాన్ కూడా ...నా సంగతా ? నువ్వు నమ్మనుకుంటా ... నీ సినిమా ఒక్కటే చూడలేదు నేను ... " అని నవ్వాడు సుమంత్.

తల వంచుకుని నవ్వుతాడు సుమంత్. తనకు తాను నవ్వుకుంటున్నట్లు ఉంటుంది. లోలోపల ఎంతో ఎదుగుదల ఉందనిపించింది అతనిలో.

"చెప్పు సుందరీ ! జీవితంలో నువ్వు కావాలనుకున్నవన్నీ పొందావా ?"

ఆ ప్రశ్న చురుక్కుమని సుందరి హృదయాన్ని తాకింది.

సుమంత్ గొంతులోని గాంభీర్యమూ మాటదనమూ ఆమెను వివశురాలిని చేశాయి.

"సుమంత్ ! అలా ఎందుకు అడిగావు నువ్వు ?"

నిశ్శబ్దం కొంతసేపు రాజ్యం చేసింది.

కళ్ళు మూసుకున్నాడు సుమంత్.

"నేనిక్కడ ఒక కాలేజీ లెక్చరర్‌గా ఉంటున్నాను సుందరీ ... మా ఆవిడకు నేనంటే పంచప్రాణాలు ... ఉద్యోగం చెయ్యమన్నా, కొన్నిరోజులు చేసి మానేసింది. ఎంతగా అనిపించదూ ? ఒకరలా వుంటారు...ఒకరిలా వుంటారు..."

"సుమంత్ !... నేనొకటడగనా ? ఆ రోజుల్లో నువ్వు..."

"సెంటిమెంటల్‌గా ఉండేవాణ్ణి ... కాని ఫూల్‌ని కాననుకుంటాను సుందరీ ! ఎన్నాళ్ళకో కనిపించావు. నువ్వు కనిపిస్తే చెప్పాలనుకున్నమాట ఒకటుంది. ఏమిటో తెలుసా ? ఐ..."

## సున్నితంలోంచి శక్తిలోకి..

సుందర సుకుమార
సుమాల రేకులు —
శౌర్యం జోడింపబడితే
సూదైన బాకులు !
అందచందాల సోయగాల్ని
అభివర్ణించే కలం —
అరుణారుణ కిరణం సోకితే
ఆక్రోశించే త్రిశూలం !!
నవమిలో తొణికిసలాడే
కనికందని సుందరాంగి —
హృదయం క్షోభిస్తే
ఆగ్రహోదగ్ర సింహిని !!!

- దొడ్లంకి వెంకట్రావ్

"చాలు సుమంత్ ! ... " ఆవేశంగా అంది సుందరి. ఎగసి వస్తున్న భావావేశాన్ని అదుపులో పెట్టుకోలేకపోయింది — "నువ్వు దుర్మార్గుడివి ... హృదయం లేనివాడివి ... స్వార్థపరుడివి కూడా..."

ఆమె మాటలు వినిపించుకోనివాడిలా, తనకు తాను చెప్పుకున్నాడు సుమంత్; "మన విలువలు వేరు సుందరీ ! ... మనం కలవలేమని తెలుసు. దగ్గరగా ఉంటే — కలవాలనే తపన ఎక్కువైతే — భరించలేనని తెలుసు. అందుకే దూరమైపోయాను. స్వార్థపరుణ్ణే—కాని ... "

పాతాళంలోపడి కొట్టుకుంటున్నట్టుగా ఉంది సుందరికి.

కొంతసేపు ఇద్దరూ మౌనంగా ఉండిపోయారు.

చీకటి ముసురుతుండగా—"ఇక వెళ్దాం దా.." అంది సుందరి లేస్తూ.

కార్ డ్రైవ్ చేస్తున్న సుందరి కళ్ళలో గిర్రున నీళ్ళు తిరిగాయి.

"సుందరి... అయామ్ సారీ... నన్ను మన్నించవూ ?... పోనీ — మన్నించకులే...".

అతణ్ణి తిట్టి కొట్టి రక్కి ముద్దుపెట్టుకోవాలనిపించింది సుందరికి.

అంతటి తిక్కకన్నా ఎక్కువ శూన్యం ఒక్కసారిగా ఆవరించటంచేత ఆ పని చెయ్యలేకపోయింది. "యు ఆర్ ఎ స్వీట్ ఇడియాటిక్ గాడ్ !"—అంది.

చౌరస్తాలో కారు ఆపించుకుని దిగేశాడు సుమంత్ — "థేంక్స్ ఫర్ రిమెంబరింగ్ మీ సుందరీ !... ఐ స్టిల్ —"

కుదుపుతో కారును దూకించింది సుందరి.

వీధులు నిర్మానుష్యంగా ఉంటే — ఏ గోడకో కారును గుద్దేయాలనిపించింది.

సుందరి ఒంట్లో రక్తం నడక మారినట్లుయింది.

ఏవో తలుపులు తెరుచుకున్నాయి, ఏవో మూసుకున్నాయి.

[ఇంకా వుంది]

## "డాక్టర్, మాకు ఒకరంటే ఒకరికి ఎంతో ప్రేమ, కాని..."

దిలీప్, రజని ఎంతో బెంగతో తమ కుటుంబ డాక్టర్‌ని కలుసుకున్నారు. "మేము బహుశ ఒకరికొకరం తగమనుకుంటాం డాక్టర్" అని, తన విచారాన్ని కప్పిపుచ్చుకుంటూ అన్నాడు దిలీప్. డాక్టరుగారు నెమ్మదిగా ప్రశ్నించి రజని సమస్య తెలుసుకున్నారు. విషయం ఏమిటంటే, ఆమె జననాంగం లోపల పొడిగా వుండటం వల్ల వారి దాంపత్య సంబంధానికి ఇబ్బంది కలుగుతోంది. డాక్టర్ ఇలా చెప్పారు. ఇటీవలి వరకూ ఈ అవసరానికి తగిన సాధనమేదీ ఉండేది కాదు. కాని అదృష్టవశాత్తూ ఇప్పుడు జాన్సన్ అండ్ జాన్సన్ కంపెనీ—ఈ కంపెనీ పిల్లల సంరక్షణ ఉత్పత్తులకు పేరు పొందిన కంపెనీ— ఒక ఉత్పత్తిని తయారుచేసింది. దాని పేరు కె.వై* జెల్లీ. ప్రత్యేకంగా తయారైన ఈ జెల్లీ స్వచ్ఛమైనది, తేలికగా వుండే జారుడునిచ్చేది, అచ్చం శరీరపు సహజమైన జారుడు ద్రవం లాగా ఉంటుంది. అంతేకాదు. ఇది నీటిలో కరిగిపోతుంది, పట్టుకొని కాని, జిడ్డుగా కాని ఉండదు. దీన్ని ఎంతో అనువుగా ఉపయోగించవచ్చు, సులభంగా కడిగేసుకోవచ్చు.

డాక్టర్ ఇంకా ఇలా అన్నారు. కె-వై* జెల్లీ క్రిములు లేనిది. దీని పి. హెచ్. స్థాయి (ఆమ్ల, క్షార నిష్పత్తి) మనుష్య చర్మానికి అనుగుణంగా ఉంటుంది. అంచేత, ఇది పూర్తిగా సురక్షితమైనది. దీన్ని భార్యా భర్తల్లో ఎవరైనా ఉపయోగించవచ్చు. కె-వై* జెల్లీ రాసుకోగానే, పొడిదనం పోయి మృదుత్వం వస్తుంది. ఈ జెల్లీ ఒక పల్చని పొరలాగా ఏర్పడి, సున్నితమైన చర్మాన్ని ఒరిపిడి నుంచి కాపాడుతుంది అని వివరించారు డాక్టర్. కొంతకాలం తర్వాత వారికి కె-వై* జెల్లీ ఉపయోగించవలసిన అవసరం ఉండకపోవచ్చు. అయినప్పటికీ దాంపత్య సంబంధం సంతృప్తినిచ్చేందుకు ఒక జారుడు పదార్థంగా ఈ జెల్లీని వారు ఉపయోగించడం మంచిది అని సలహా ఇచ్చారాయన.

దిలీప్, రజనిల బెంగ తీరింది. కాని వారికో అనుమానం వచ్చింది. "....మాకు పిల్లలు పుట్టడానికి ఇది ఆటంకం కలిగించదా డాక్టర్" అని అడిగారు. ఆరోగ్యమైన, చక్కని బిడ్డల్ని కనడానికి కె-వై* జెల్లీ ఎటువంటి ఆటంకం కలిగించదు అని చెప్పారు డాక్టర్.

తేలికైన మనసులతో సెలవు పుచ్చుకున్నారు ఆ దంపతులు. ఇంకొక వైవాహిక జీవితం ఇప్పుడు సుఖప్రదం కాబోతోంది.

# "డాక్టర్ మాకు ఒకరంటే ఒకరికి ఎంతో ప్రేమ, కాని..."



# ది ట్రయల్



పాలడుగు వెంకటేశ్వరరావు

'మైడియరెస్ట్ రమా !

ఇవ్వాళ కలకత్తా నుంచి మా నాన్నగారు వస్తున్నారు. ఆయనతో మన విషయం చెప్పి, వెంటనే వ్యవహారాన్ని సెటిల్ చేస్తాను. ఆయన నా మాటను కాదనరు. అందువలన, నువ్వు తియ్యని కలలు కంటూ, వొచ్చే నెలలో మన పెళ్ళి అవగానే, మన హనీమూన్ గురించి ప్లాను చెయ్యి. సబిత గురించి వ్రాసావు గదూ ! షి ఈజ్ ఏ ఫూల్. క్లాసుమెట్ గనుక, ఏదో ఎంటర్టెయిన్ చేస్తున్నాను గానీ, అయ్ డోంట్ లయిక్ హర్ ! ఈ సంగతి తనకి మొహం మీద చెప్పేయలేక పోతున్నాను. నేనంటే పిచ్చి వ్యామోహంలో పడింది. వాట్ కెన్ ఐడూ ?! మన పెళ్ళి అయ్యాక, అసలు సంగతి తెలిసి తనే సర్దుకుంటుందిలే ! పూర్ గాల్ ! ఒక పది రోజులలో, పెళ్ళి కొడుకుగారు, పెద్దలతో కలిసి, పెళ్ళిచూపుల కోసం వస్తారు. గెట్ రెడీ. ఈ వుత్తరంతోపాటు సబితకి కూడా ఒక వుత్తరం, వేరే వ్రాస్తున్నాను. తను నన్నర్థం చేసుకోదు. వుత్తరాలతోనే నన్ను చంపేస్తుంది. నాకూ, తనకి జవాబివ్వక తప్పటంలేదు. అయినా ఇది ఇంకా ఎన్నాళ్ళో సాగదులే. మన వివాహం సంగతి తెలియగానే సబిత, తనే ఆ వుత్తరాల ట్రాక్‌ని బంద్ చేసేస్తుంది. సబిత గురించి ఎక్కువగా ఆలోచించి బుర్ర వెడగొట్టుకోవద్దు, నువ్వు. ఐ లయిక్ హర్. దట్స్ ఆల్ ! బట్ అయ్ లవ్ యూ. అందుకే నిన్ను పెళ్ళి చేసుకుంటున్నాను— యువర్ డియరెస్ట్ శేషు.'

ఉత్తరం రాయటం ముగించి, మూర్తికిచ్చాడు. శేషు. అతని మొహాన చిరునవ్వులూ, చిరుచెమటలు పట్టాయి. సిగరెట్ వెలిగించి రెండు పఫ్‌లు లాగి రిలాక్సయ్యాడు, శేషు.

ఆ ఉత్తరం చదివి, ఆశ్చర్యపోయాడు మూర్తి.

'ఈ రమ ఎవరు ?' అని అడిగాడు మూర్తి.

'మన క్లాస్‌మేట్' — తాపీగా అని చిరునవ్వు నవ్వాడు, శేషు.

'నువ్వు ఈ గ్రంథం ఎప్పుడు నడిపావ్ ?! ఇప్పటిదాకా వెంటబడి, వుత్తరాలు రాసి సబితని లవ్ చేసావు గదా ?'

'ఇందులో గ్రంథం ఏం లేదు! జస్ట్ ట్రయల్. సబిత నన్ను ఎంత గాఢంగా లవ్ చేస్తూందో తెలుసుకోనటాన్కి ఒక చిన్న ప్రయత్నం.'

'అంటే ?!'

'రమతో నాకు పరిచయం వుంది గానీ, ఇటువంటి వ్యవహారం అసలు లేదు '

'మరి ఈ వుత్తరం ఏమిటే ?'

'ఈ వుత్తరం రమకు చేరదు. ఇదుగో ఈ కవర్‌పైన ఎడ్రస్ చూడు. ఇది సబిత ఎడ్రస్. నేను పొరపాటున, రమకి రాసిన వుత్తరం సబితకి అందినట్లు అన్పిస్తుంది. ఇందులోని కంటెంట్స్ చదివి సబిత కంగారు పడుతుంది. ఆశ్చర్యపోతుంది ?'

'ఆ తరువాతా ...!'

'తర్వాత తను తిన్నగా నా దగ్గరకి వచ్చి నన్ను కడుగుతుంది, తిడుతుంది, ఏడుస్తుంది. కోపంతో నా చంప పగలగొట్టుంది. చివరికి నాకు పశ్చాత్తాపం కలిగి, ఆమెను క్షమాపణ కోరతాను. ఆమెకి అసలు సంగతి చెబుతాను. మా ఇద్దరి మధ్యా అసలు రమకి

## మీ స్నానమునందు ఒక క్రొత్తదనము నిచ్చు

## సబ్బు- ప్రేమ్




సుకుమారమైన మీ చర్మ సౌందర్యమునకు ప్రేమ్.
దీని పరిమళము స్వచ్ఛమైన నురగ మీ శరీరమును ఆహ్లాదింపజేయును

మీ శరీరమునకు మృదుత్వమునిచ్చు సబ్బు-ప్రేమ్.

Imageads-M-1564





జయలక్ష్మి
గుంటూరు వారి తయారీ




ప్రేమ్ - తాజాతనము నందించు సబ్బు.

స్థానమే లేదని చెపుతాను. ఆమె యొక్క టియర్స్ అపుడు ఆనందాశ్రువులుగా మారి ఆమె నా కౌగిలిలో వొదిగిపోతుంది. జస్ట్ దట్ ! దస్ దీ లవ్ స్టోరీ ఎండ్స్ విత్ ఏ టంత్ ఆఫ్ థ్రిల్ !' నవ్వాడు శేషు.

'ఇలాగే జరగాలనేముందీ ?'

'మరెలా కూడా జరుగవచ్చు నంటావ్? నువ్వు చెప్పు, వింటామూ'

'నువ్వు రాసిన ఈ వుత్తారాన్ని నమ్మి, ఆమె రమ దగ్గరకే వెళ్ళి, అల్లరి చెయ్యవచ్చును. గొడవా జరుగవచ్చును. సబిత నువ్వు తనకి రాసిన వుత్తరాన్ని బయట పెట్టవచ్చును.'

'ఇట్ కెన్ హాపెన్. ఈ లేడీస్ వట్టి సెంటి మెంటల్ ఫూల్స్ ! సబితా మే ఫైట్ విత్ రమా ! ఎందుకంటే సబిత నన్ను గాఢంగా ప్రేమిస్తున్నది. నాకు తెలుసు.'

'అదే నేననేది ! అలా అల్లరవటం మ్యాపెన్స్ గదా !'

'నిజమే. కాని, అలా జరగదు.'

'ఎందువలన ?'

'రమ వూళ్ళో లేదు. నిన్ననే బెజవాడ వెళ్ళింది. పదిరోజులదాకా రాదు — నెక్స్ట్ ? !'

'ఈ వుత్తరం దెబ్బకి విరక్తి చెంది, ఆమె ఆత్మహత్యకి ప్లానుకోవచ్చును.''

'నిజమే. ఈ ఆడవాళ్ళల్లో ఎంత పిరికితనం వుందో, అంత సాహసమూ వుంది. అందువలన ఈ ఉత్తరం సబితకి అందిన క్షణం నుంచీ, ఆమెమీద, కాపలా వుంటుంది. స్ట్రిక్ట్ విజిలెన్స్. నా మనిషి ఆమె ప్రయత్నాలను గమనించిన వెంటనే, ఆ విషయం క్షణాలలో నాకు తెలుస్తుంది.'

'ఎలాగా ?'

'ఫోనుమీద.'

'అయితే — '

'నేను వెంటనే అక్కడికి వచ్చి వాలతాను. అయ్ విల్ ఫేస్ దీ సిట్యుయేషన్! కథను సుఖాంతం చేయగల సామర్థ్యం నాకు వున్నదని నా నమ్మకం' దృఢంగా అన్నాడు శేషు.

'నిజంగా నువ్వు అంతటి హీరోవే ! కాని, ఇటువంటి దుందుడుకు పనులు ఎటువంటి వారికి కూడా తగవని, నా వుద్దేశ్యం. ఆ తర్వాత విచారించి లాభం లేదు. నా మాట విను శేషూ.'

'ముసలి కబుర్లు చెప్పకు. యూ ఆర్ ఏ వెంగ్ మాన్ ! ఈజిన్టిట్ !?'

'సరే. ఇంతకీ ఎవరా కాపలాదారూ ?'

'ఇంకెవరు ? నువ్వే.'

'నేనా ?!'

'అవును. దూరపు చుట్టరికం వలన, సబిత తల్లిదండ్రులతో పరిచయమూ, ఆ ఇంటికి నీ రాక పోకలూ, వున్నాయి. సబిత నన్ను లవ్‌చేసి, నన్నే పెళ్ళి చేసుకోవాలని గట్టిగా పట్టుబట్టటం వలన, నువు ఫెయిలయ్యావుగానీ, నువ్వు, ఆ ఇంటికి అల్లుడవవలసిన వాడివిగదా. నాతో పోటీ పడలేక పోయావుగానీ, నీకేం తక్కువా ?'

'బాగానే వుందిలే ! సింప్లీ వండ్రఫుల్. సరే, కానీ — '

'ఈ ఉత్తరం ఇవాళ పోస్టులో పడుతుందా ! రేపీపాటికి సబితకి అందుతుంది. నువ్వు రేపు వాళ్ళింటికి వెళ్ళు. ఆమెను గమనించు. డిటెక్టివ్ కళ్ళతో వాచ్ చెయ్యి. వెంటనే ఇవతలికి వచ్చి, ఫోనుచేసి నాతో చెప్పు.'

'నేను అలా చెయ్యనంటే ? భగ్న ప్రేమికుడ నయిన నేను నా 'రైవల్'వయిన నీకెందుకు వుపయోగపడాలి ?'

'డోంట్ టాక్ ట్రాష్. నువ్వు నేను చెప్పినట్లు చేస్తావు ! దట్సాల్.'

'ఆ నమ్మకం ఎందుకూ, అని ?'

'బికాజ్ వుయార్ ఫ్రండ్స్. గేమ్‌లో గెలుపోటములు సహజం. అంతమాత్రానికే మన స్నేహం చెక్కు చెదరటానికి వీలులేదు !'

'నేనూ, ఆ స్నేహ ధర్మంతోనే చెప్తున్నాను. ఇప్పుడయినా, నిప్పుతో చెలగాటం ఆడటం మానెయ్యి. ప్లీజ్ !'

'ఇట్ విల్ బీ ఆల్ రయిట్ బాయ్ ! జస్టే స్మాల్ గేం ఫర్ దా థ్రిల్ ! దట్సాల్. డోంట్‌వర్రీ. రేపు మధ్యాహ్నం నీ దగ్గరనుంచి ఫోన్ కాల్ ఎక్స్‌పెక్ట్ చేస్తుంటాను ...'

'నీ ఇష్టం' భార హృదయంతో లేచాడు మూర్తి.

'థాంక్యూ. థాంక్యూ వెరీ మాచ్ !'

* * *

మర్నాడు సాయంత్రం —

గోడ గడియారం నాలుగ్గంటలు కొట్టింది. ఇంకా ఫోను రాలేదు. అసహనంగా, అటూ ఇటూ పచార్లు చేస్తున్నాడు శేషు. అతని యువక హృదయం ఉద్వేగపు అలల తాకిడికి, సంచల నాత్మకంగా వుంది.

'ట్రింగ్. ట్రింగ్. ట్రింగ్.' ఫోను మ్రోగింది. ఎగిరి గంతేసి వెళ్ళి రిసీవరు అందుకున్నాడు శేషు. 'అలోవ్...' గుండెల్నిండా థ్రిల్లు !

'హలో. నేను మూర్తిని మాట్లాడుతున్నానురా, శేషూ.'

## శబ్ద చికిత్స !

శబ్ద తరంగాలను కూడా చికిత్సగా ఉపయోగించటానికి వీలవుతుందని పశ్చిమ జర్మనీ శాస్త్రజ్ఞులు నిరూపించారు. శబ్ద తరంగాలతో ఒంటి నొప్పులను తగ్గించే పరికరాన్ని తయారుచేశారు. దీని పేరు నోవాఫోన్. శరీరంలో ఏ భాగంలోనైనా నొప్పులను తగ్గించటానికి ఈ పరికరం తోడ్పడుతుంది. నరాలు, కండరాల నొప్పులు, దవడ వాపులు, సైనసైస్ వాపులు, రక్త ప్రసరణ లోపాలకు దీనితో చికిత్స చేయవచ్చు. మందులను వాడనక్కర్లేదు. దీనివలన ఇతర దుష్ఫలితాలు ఏర్పడవు. తక్కువ ఆవృత్తి గల శబ్ద తరంగాలను కొంతకాలంగా చికిత్సకు ఉపయోగిస్తున్నారు. అయితే, ఇటువంటి పరికరాన్ని రూపొందించటం మాత్రం ఇదే ప్రథమం.

'ఆఁ నేనేరా, మూర్తి. ఏంటి విశేషాలూ బేబీ ఎల్లా వుందీ ?'

'అయాం సారీ, మై బాయ్ !'

'ఏమిట్రా బాబూ ? సబిత అప్‌సెట్ కాలేదు గదా ?'

'షీ ఈజ్ ఓకే. కాని నీ కొంపే మునిగిందిరా'

'నా కొంప మునిగిందా ? ! ఏమయిందిటా ?'— గలగల నవ్వాడు శేషు.

'ఇవాళ నేను ఇక్కడికి వచ్చేసరికి, అనుకోకుండా మా అమ్మా నాన్నా వచ్చి వున్నారు. సబిత తన నిర్ణయాన్ని గురించి వాళ్ళ నాన్నతో చెప్పేసరికి, కూతురి కోసం ఏమయినా చెయ్యగల ఆ పెద్దమనిషి వెంటనే మావాళ్ళతో తాంబూలాలు పుచ్చేసు కున్నాడు !!'

'ఏమిట్రా నువ్వనేదీ ? అసలా వుత్తరం బేబీకి అందిందా ?'

'ఆఁ. అప్పుడు నేను ఇక్కడ్నే వున్నాను. తాపీగా చదివింది సబిత, వుత్తరాన్ని. చదివి ఏమందో తెలుసా ? నాతోనే అన్నదిరా.'

'ఏమన్నదీ ? !'

'శేషు ఇలా వుత్తరం రాసి, నాకు ఎందుకు పంపించాడో నాకు అర్థం కావటంలేదు. అతను ఇంత వీక్‌నెస్ వున్న మనిషని తెలిస్తే, నేను అతని జోలికే పోకపోదును. ప్రేమించిన ఆడదాన్ని ఇలా అవమానించే వ్యక్తులంటే నాకు చాలా అసహ్యం. అందువలన నేను ఈ క్షణంనుంచీ ప్రేమించటం మానేసి, ప్రేమించబడతాను, ఏమంటావూ ? అని నన్ను అడిగిందిరా.'

'అడిగిందా ? ! మరి నువ్వేమన్నావురా, రాస్కెల్ ?'

'నేనేమనలేదుగానీ, సబితే, యమాడేరింగ్‌గా, తను నన్ను పెళ్ళి చేసుకోవటాన్కి నిర్ణయించు కున్నట్లుగా పెద్దల ముందు ప్రకటించిందిరా ! అంతా అయిపోయింది ! ముహూర్తాలు కూడా పెట్టేసుకున్నారు ! వచ్చే నెల పదో తేదీనే మా పెళ్ళి !!'

శేషు చేతులు వణికాయి. మొహంనిండా చమట పట్టింది.

'ఇంతకీ ఇప్పుడు నువ్వు ఎక్కడ్నుంచి మాట్లాడుతున్నావు, నాయనా ! ? ఘోరంగా నువ్వే ఇలా నా కొంప ముంచుతావనుకోలేదురా, మూర్తిగాడా !'

'అయాం సారీ ! టేకిట్ ఈజీ. ఇట్స్ ఏ గేమ్ !'

'ఇంతకీ నువ్వు ఎక్కడ్నుంచి...'

'నేను సబిత ఇంట్లోనించే మాట్లాడు తున్నాను. సబితా ఇక్కడే వుంది. మాట్లాడతావా ? మా మారేజి విషయం, తనే నీతో స్వయంగా చెప్తుందట, సబిత.'

'అక్కర్లేదు.' ఫోను పెట్టేశాడు శేషు. అతని వళ్ళంతా చమటపట్టింది. కళ్ళు ఎర్రగా అయ్యాయి. మంచంమీద వాలిపోయాడు. కుప్పగా కూలి పోయాడు.

దట్సాల్. దీ ట్రయల్ కాస్టెడ్ ఎవ్విరీథింగ్ !



సీరియల్

# జీవన్మృతులు

ఇంగ్లీషు మూలం: బ్రామ్ స్టోకర్

స్వేచ్ఛానువాదం: కొలను వెంకట దుర్గాప్రసాద్



## డాక్టర్ సెవార్డు డైరీ!

(గత సంచిక తరువాయి)

సెప్టెంబర్, 30; నేను ఇంటికి వచ్చేసరికి అయిదయింది. అప్పటికే ఆర్థర్, మోరిస్‌లు రావటం, జొనాథన్, అతని భార్య మీనా తయారు చేసివుంచిన కాగితాలు, డైరీలు చదవటం అయిపోయింది. జొనాథన్ బయటకువెళ్లి ఇంకా రాలేదు. మీనా నాకు ఒక కప్పు టీ ఇచ్చింది. నిజాయితీగా చెప్పాలంటే, మొట్టమొదటిసారిగా ఈ ఇల్లు 'ఇల్లు'లా కనిపించింది. టీ తాగినతర్వాత మీనా అడిగింది.

''డాక్టర్ సెవార్డు! మిమ్మల్ని ఒకటి అడగొచ్చా? మీ పేషెంటు మిస్టర్ రెన్‌ఫీల్డును చూడాలనుకుంటున్నాను. నన్ను అతన్ని చూడనివ్వండి. అతనిగురించి మీరు డైరీలో వ్రాసిన విషయాలు నాకెంతో కుతూహలాన్ని కలిగించాయి.'' ఆమె అలా అడుగుతుంటే, కాదనబుద్ధికాలేదు. కాదనటానికి కారణంకూడా కనిపించలేదు. అందువల్ల ఆమెను నాతోపాటు తీసుకెళ్లాను. నేను గదిలోపలికెళ్లి రెన్‌ఫీల్డుతో చెప్పాను. ఒకావిడ చూడాలనుకుంటోంది అని. దానికతను 'ఎందుకు?' అని అడిగాడు.

''ఆమె ఇల్లంతా చూస్తోంది. అందులో వున్నవాళ్లని పలకరించాలనుకుంటోంది'' అన్నాను. ''ఓహో అలాగా, అయితే రమ్మనండి, దానికేముంది. కానీ ఒక్క క్షణం ఆగండి. గది కాస్త సర్దేస్తాను'' అన్నాడు. అతను గది సర్దటం అంటే ఏమిటో అనుకున్నాను. అక్కడ చిన్న పెట్టెల్లోవున్న, ఈగల్ని, సాలెపురుగుల్ని గబగబా మింగేసాడు. తన విషయంలో ఇతర్ల జోక్యం అతనికి ఇష్టంలేదని తెలుస్తోంది. అతని పని పూర్తి అయ్యాక, నవ్వుతూ ''ఇప్పుడు ఆమెను రమ్మనమనండి'' అన్నాడు. అతను మంచం చివర కూర్చున్నాడు. కాస్త తల వంచాడు. కానీ అతని కనుబొమలు పైకెత్తివున్నాయి, ఆమె రాకను గమనించడంకోసం. ఆమె లోపలికి వచ్చింది. ఇదంతా కష్టాన్ని కొనితెచ్చుకోడం అనిపించింది. అప్పుడు ఒకసారి అతను నా గదిలోకి వచ్చేముందు ఎంత సౌమ్యంగా వున్నాడో జ్ఞాపకముంది. కాని తర్వాత ఎంత దారుణంగా తిరగబడ్డాడు? అందుకే భయమేసి అతని చేరువగా నిలబడ్డాను. ఒకవేళ ఏదైనా అఘాయిత్యంచేస్తే, వెంటనే మీదపడి పట్టుకోడానికి. ఆమె ఎంతో హుందాగా లోపలికెళ్లింది. ఆమె హుందాతనం అతన్ని ఆకర్షించి, ఆమెను గౌరవించేలా చేసింది అనిపించింది. ఆమె తిన్నగా అతని దగ్గరికెళ్ళి చిరునవ్వుతో చెయ్యి చాచింది.

''గుడ్ ఈవినింగ్ మిస్టర్ రెన్‌ఫీల్డ్!'' అంది. ''చూడండి, మీరు నాకు తెలుసు. డాక్టర్ సెవార్డు మీ గురించి చెప్పారు.''

దానికతను వెంటనే జవాబు ఇవ్వలేదు. ఆమెను ఆపాదమస్తకం చూసాడు. అతనలా గమనిస్తుంటే, నాకు అనుమానమొచ్చింది. కానీ, అతని జవాబు నాకెంతో ఆశ్చర్యాన్ని కలిగించింది. అతను ఇలా అన్నాడు —

''డాక్టర్ పెళ్లాడదామనుకున్న అమ్మాయి మీరు కాదు కదూ? మీరు కావడానికి వీల్లేదు. ఆమె చనిపోయింది. మీకు తెలుసా?'' అతని మాటలకు ఆమె చిరునవ్వు నవ్వింది.

''ఓ, కాదు. నాకు పెళ్ళయింది. డాక్టర్ సెవార్డును చూడకముందే, నా భర్తతో నాకు మనువు కుదిరింది. ఆయన కూడా నన్ను ఇంతకి ముందు చూడలేదు. నా పేరు మినాహార్కర్'' అంది.

''అయితే, మీరు ఇక్కడేం చేస్తున్నారు?'' అడిగాడు.

''నేనూ, నా భర్త, పూర్కే డాక్టర్ సెవార్డు అతిథులుగా వచ్చాం'' అంది.

''అయితే, ఇక్కడ వుండొద్దు. వెళ్లిపొండి'' అన్నాడు.

''ఏం, ఎందుకని?'' అడిగింది ఆమె. వాళ్లని సంభాషణలో పెట్టడం అంత మంచిది కాదనిపించింది. అందుకే నేను జోక్యం చేసుకుని ''నే· ఒక అమ్మాయిని పెళ్లి చేసుకోబోతున్నట్టు నీకె· తెలుసు?'' అడిగాను.

''ఏమిటా వెధవ ప్రశ్న?'' అన్నాడు.

''అందులో తిట్టవలసిందేముంది, మిస్ట· రెన్‌ఫీల్డ్?'' మినా నన్ను వెనకేసుకుని అడిగిం· దానికతను ఎంతో నమ్రతగా, గౌరవంగా, నా· జవాబు చెప్పిన తీరుకు పూర్తి వ్యతిరేకంగా అన్నాడ·

''మీరైతే అర్థం చేసుకోగలరు. ఈయనలాం· మనిషి ప్రేమించబడినప్పుడు, గౌరవింపబడినప్పుడ· ఈయనకు సంబంధించిన విషయాలన్నీ, మాలాం· వాళ్లకు తెలుస్తాయి. డాక్టర్ సెవార్డు, అతనింట్· మనుషులు, స్నేహితులేకాదు, అతని పేషంట్లుక· కూడా ఎంతో ఇష్టం. పిచ్చివాళ్ళు కూడా ఇత· దగ్గర మంచిగా ప్రవర్తిస్తారు. ఈ పిచ్చివాళ్ళ ఆశ్రమంలో ఎప్పట్నించో వుంటున్నాను గాబట్టి నేను బాగా గమనించి చెపుతున్నాను.''

అతని మాటలకు నిస్తూపోయాను. అతనిలో ఏదో కొత్త విషయం కనిపించింది. 'ఎంతో పిచ్చివాడు, వింత ప్రవృత్తి గలవాడు, ఇటువంటివాడు ఎప్పుడూ నాకు తగల్లేదు,' అనుకున్న ఇతను, నాగురించి సమీక్ష చేయడం, అందునా ఎంతో సౌమ్యంగా, ఆశ్చర్యపరచింది. మిసెస్ మినాహార్కర్ సమక్షంలో అతని బుర్రలో ఏదైనా జ్ఞాపకశక్తి ప్రవేశించిందా అనిపించింది. ఇతను మామూలువాడిలా ప్రవర్తించడం, వింత విషయమైనా, ఆమె ప్రభావం అతనిమీద కొంతవుంది, ఆమెకు ఆశక్తివుంది— ఇట్లా అనిపించసాగింది.

అతనితో కొద్దిసేపు మాట్లాడాం. అతని వాలకాన్నిబట్టి అతను కాస్త స్థిరమనస్తత్వం గలిగినవాడు అనిపించాడు. అదే సమయమనుకుని, ఆమె నా వంక ఓ సారి ప్రశ్నార్థకంగా చూసి, అతన్ని మళ్ళీ మాటల్లోదించింది. అతనిమాటలకు ఈ సారికూడా నేను ఆశ్చర్యపోక తప్పలేదు. ఎందుకంటే అతని మాటల్లో ఎంతో వివేకం కనిపించింది. అతని మాటలు ఇట్లాసాగాయి—

''నా మటుకు నన్ను తీసుకోండి. నా కొక వింతనమ్మకముంది. నా స్నేహితులు నన్నుచూసి ఆందోళన చెందుతున్నారంటే, అందులో అబద్ధం

**జరిగిన కథ — 25 :** ఆ రాత్రికి లూసీ సమాధి దగ్గరకు వచ్చి చూస్తే దాంట్లో ఆమె కనిపించదు. చర్చి ఆవరణలో పొంచివున్న సెవార్డ్‌కి లూసీ కనిపిస్తుంది. వాన్‌హెల్సింగ్‌కి దొరికిన పసిపాపను పోలీసులకి అప్పగిస్తారు. కానీ ఆ పాప మెడపై గాట్లు లేకపోవడం గమనిస్తారు. ప్రొఫెసర్ వాన్‌హెల్సింగ్ ఉత్తరం ద్వారా ఆర్థర్‌ను, క్విన్సీమోరిస్‌లను రప్పిస్తాడు. వాళ్లకి కూడా సెవార్డ్‌కి చూపించిన దృశ్యాన్ని చూపిస్తాడు. ఆర్థర్‌ని గుర్తుపట్టిన లూసీ అతన్ని చేరుకోబోయేంతలో వాన్‌హెల్సింగ్ అడ్డుపడతాడు. లూసీ సమాధిలోకి వెళ్తుంది. లూసీ శరీరంలో ప్రవేశించిన రాక్షసిని హతమారుస్తాడు ఆర్థర్, వాన్‌హెల్సింగ్ చెప్పిన విధంగా. జొనాథన్ డైరీ చదివి కొన్నివిషయాలు తెలుసుకుంటాడు డాక్టర్ సెవార్డ్. జొనాథన్ 'డ్రాకులా' గురించిన వివరాలను సేకరిస్తుంటాడు.

లేదు. నన్ను అదుపులోవుంచటానికి ప్రయత్నిస్తున్నారు. మనిషిజీవితం శాశ్వతం అనుకుంటూవుండే వాడ్ని. లెక్కలేనన్ని ప్రాణుల్ని, ప్రాణులంటే చిన్నవిగానీ, పెద్దవిగానీ, హరించి మనిషి ఎక్కువ కాలం జీవించవచ్చు అనుకుంటూవుండేవాడ్ని. ఒక్కోసారి మనిషిప్రాణాన్నికూడా హరిద్దామన్న ప్రయత్నం ఎంతో గట్టిగాచేసాను. ఈ డాక్టరు నన్ను ఎంత గానో భరించాడు. ఒకసారి ఇతన్ని చంపుదామని ప్రయత్నించాను. అతనిరక్తాన్నితాగి నాలో బలాన్ని వృద్ధిచేసుకుని, శక్తుల్ని సాధిద్దామనుకున్నాను. ఇదంతా కొన్ని మంత్రాల్లో రాసినదానిమీదవున్న నమ్మకంచేత. 'రక్తమే జీవితం'అని రాసుంది. కానీ ఇది రోతపుట్టేవిధంగా వుంది. కదూ డాక్టర్ ?''

నేను అవునని తలూపాను. అతనిమాటలకు ఆశ్చర్యంతో నిలబడిపోయి, అంతకంటే ఏం చెయ్య లేకపోయాను. కొద్ది నిముషాలక్రితం అతను కొన్ని ఈగల్ని, సాలెపురుగుల్ని, తిన్నాడంటే నమ్మటం కష్టంగావుంది. నా వాచీ చూసుకున్నాను. వాన్ హెల్సింగ్‌కోసం స్టేషనుకువెళ్లాలి. మినాతో ఆ విషయమేచెప్పి, వెళతానన్నాను. ఆమెకూడా బయలుదేరింది. వెళ్లేముందు రెన్‌ఫీల్డుతో ''గుడ్‌బై, మిమ్మల్ని తరుచూ కలుస్తుంటాను...'' అంది. దానికతనిజవాబు మళ్ళీ నాకు ఆశ్చర్యాన్ని కలుగజేసింది.

'గుడ్‌బై మైడియర్. మళ్ళీ మీ మధురమైన మోము నేను ఎప్పుడూ చూడగూడదని భగవంతుడ్ని కోరుకుంటున్నాను. దేవుడు మిమ్మల్ని చల్లగా చూస్తాడు' అన్నాడు.



వాన్‌హెల్సింగ్‌ను కలవటానికి నేను స్టేషన్‌కు వెళ్లాను. ఆర్థర్, మోరిస్ ఇద్దరూ నావెనక వుండిపోయారు. పాపం ఆర్థర్ ఇదివరకటికన్నా కాస్త కులాసాగానే కనిపిస్తున్నాడు. క్విన్సీమోరిస్‌కూడా అంతే, ఈ మధ్య ఎప్పుడూలేనంత ఉత్సాహంగా కనిపించాడు.

వాన్‌హెల్సింగ్ రైలుపెట్టెలోంచి దిగి, చిన్నపిల్లాడిలా అటూ ఇటూ పరికించాడు. నన్ను చూసి నా దగ్గరకు పరుగెత్తుకొచ్చాడు.

'హా, మిత్రమా జాన్, ఏవిటీ సంగతులు ? బాగానే వున్నావా? ఎన్నో పనుల్లో మునిగిపోయాను. ఇక్కడ అవసరమైతే వుంటాను. చాలా విషయాలు సర్దుబాటు చేసేసాను. నీకు ఎన్నో విషయాలు చెప్పాలి. మేడమ్ మీనా మీ ఇంట్లో వుందా ? అవును కదా ! మరి ఆమె భర్త ? ఆర్థర్, మన మిత్రుడు మోరిస్? వాళ్ళుకూడా నీతోనే వున్నారా? బాగుంది !'' అన్నాడు.



ఇంటికి వెళుతూ దారిలో వాన్‌హెల్సింగ్‌కు జరిగిన విషయాలు చెప్పాను. నా డైరీ గురించి మిసెస్ మీనా ఏం సలహా ఇచ్చింది, అదీ చెప్పాను. అందుకు వాన్‌హెల్సింగ్ —

'ఓ, మేడమ్ మినా! ఆమె చాలా తెలివిగలది. గొప్ప మేధావికున్నంత బుర్ర వుంది. స్త్రీ సహజమైన హృదయముంది. దేవుడు ఆమెను ఒక ప్రత్యేకమైన కారణం కోసం సృష్టించాడని నమ్ముతాను. మిత్రమా జాన్, ఇప్పటివరకు దేవుడు దయవల్ల ఈమె సహాయం పొందాం. ఈ రాత్రి తర్వాత ఆమె మనతోపాటు వుండటానికి వీలులేదు ఎందుకంటే, ఆమె ప్రమాదంలో చిక్కుకోవటం నాకు ఇష్టంలేదు. మనం మగవాళ్ళం సరే, ఎట్లాగూ ప్రతిజ్ఞపూనాం కాదా ? ఆ రాక్షసుడ్ని మట్టుపెట్టదల్చుకున్నాం. అందువల్ల ఇందులో స్త్రీ చెయ్యవలసిన పని ఏమీలేదు. ఆమెకు ప్రమాదం లేకపోయినా, ఆమె హృదయానికి పెద్ద దెబ్బ తగుల్తుంది, ఈ భయంకర చర్యలవల్ల. తర్వాత ఆమె నిద్రలోవున్నా, మేల్కొన్నా, కలగంటున్నా, ఈ సంఘటనలు ఆమెను వెంటాడి, ఆమెను అశక్తురాలిని చేస్తాయి. అందునా ఆమె వయసులో వున్న ఆడది. ఈ మధ్యనే పెళ్లి అయిందీ. ఆమె హాయిగా గడపవలసిన రోజులివి. ఆమె ఇప్పుడు చేపట్టదగిన పనులుగావు.'' అన్నాడు. అందుకే నేను హృదయపూర్వకంగా ఒప్పుకున్నాను.

తర్వాత వాన్ హెల్సింగ్‌తో జరిగిన విషయం చెప్పాను. డ్రాకులా మా ఇంటి ప్రక్కనున్న ఇంటినే కొన్నాడని చెప్పాను. దానికతను ఆశ్చర్యపోయారు. వెంటనే ఆలోచనల్లో మునిగిపోయాడు. ''అయ్యో, ఈ విషయం ముందే తెలిస్తే ఎంత బావుండేది ! మనం లూసీని రక్షించుకోగలిగి వుండేవాళ్లం. అయినా చేతులు కాలింతర్వాత ఆకులు పట్టుకుని ప్రయోజనం ఏమిటి ? ఇప్పుడు జరిగిపోయిన దాని గురించి ఆలోచించవద్దు. జరగబోయే పనుల గురించి ఆలోచిద్దాం'' అన్నాడు. తర్వాత మా ఇంటి



గేటు వచ్చేవరకు అతను మౌనంగా వుండిపోయాడు.

భోజనాలకు ముందు అతను మిసెస్ మీనాను అడిగాడు. "నా మిత్రుడు జాన్ సెవార్డు చెప్పాడు, మేడమ్ మినా ! మీరూ మీ ఆయనా కలిసి ఇప్పటి వరకు జరిగిన అన్ని విషయాలు జాగ్రత్తగా సేకరించి వుంచారట గదా ! "

"అబ్బే ! ఇప్పటివరకూ జరిగినవి తయారుచేసి పెట్టలేదు. ఈ ఉదయం వరకూ జరిగినవిమాత్రమే టైపుచేసి పెట్టాను" అంది.

"మరి ఇప్పటివరకు జరిగినవి కూడా ఎందుకు తయారు చేయకూడదు ? మీరు చేసిన పని ఎంతో ఉపయోగకరంగా వుంది. మన రహస్యాలు బయటకు చెప్పకున్నాంకదా, ఆలోచనలు ఎవరూ కాదనలేదు. వాటిల్లో అన్నీ నిజాలే" అన్నాడు.

ఆ పొగడ్తకు మిసెస్ మినా సిగ్గుపడింది. జేబులోంచి ఒక కాగితాన్ని తీసి వాన్‌హెల్సింగ్‌కు ఇస్తూ,

"డాక్టర్ వాన్‌హెల్సింగ్, ఇది మీరు చదవండి. మీ అభిప్రాయం చెప్పండి. ఇది ఇవాళ నేను రాసిన డైరీ. ఎటువంటి చిన్న విషయమైనా రాసిపెట్టు కోటం చాలా అవసరమనిపిస్తోంది. దీనిలోని విషయం ఏమీలేదు, ఎక్కువగా వ్యక్తిగతమైనది తప్ప. ఇట్లాంటివి కూడా రాయమంటారా" అంది.

వాన్‌హెల్సింగ్ దాన్ని గంభీరంగా పైకి చదివాడు. తిరిగి దానిని ఆమెకిచ్చివేస్తూ,

"మీకు అనవసరమనిపిస్తే రాయకండి. అలా అని రాయడం మానకండి. మీరు రాస్తే మీ భర్తకి ఎంతో సంతోషంగా వుంటుంది. మాకూ అంతే" అన్నాడు. ఆమె సిగ్గుపడుతూ కాగితాన్ని తీసుకుని చిరునవ్వు నవ్వింది.

ఆవిధంగా, ఈ క్షణం వరకు జరిగిన రికార్డు తయారు చేయటం, వరుసక్రమంలో వుంచటం జరిగింది. భోజనం ముగించాక చదవటం కోసం, ఒక కాపీ తీసుకున్నాడు ప్రొఫెసర్ వాన్‌హెల్సింగ్. తొమ్మిది గంటలకల్లా మేం అంతా మళ్ళీ కలవాల్సింది వుంది. మేం అంతా ఆ విషయాలు చదివిన వాళ్ళమే. కాబట్టి విషయాలు కూలంకషంగా చర్చించి, ఆ రాక్షసుడితో పోరుసల్పటానికి సిద్ధంగా వున్నాం.

### మినా డైరీ :

సెప్టెంబర్, 30 : సాయంత్రం ఆరుగంటలకు, మేం అంతా డాక్టర్ సెవార్డు స్టడీ రూంలో కలుసుకున్నాం. అంతా ఒక కమిటీలా తయారయ్యాం. ప్రొఫెసర్ వాన్‌హెల్సింగ్ ఆ సభకు అధ్యక్షత వహించారు. అట్లా చెయ్యమని డాక్టర్ సెవార్డు కోరాడు. నన్ను ఆయన పక్కన కూర్చోబెట్టుకున్నారు. ఆయన కార్యదర్శిగా వ్యవహరించమన్నాడు. జోనాథన్ నా పక్కన కూర్చున్నాడు. మాకు ఎదురుగా, ఆర్థర్ ప్రభువు, డాక్టర్ సెవార్డు, మిస్టర్ మోరిస్ కూర్చున్నారు. ప్రొఫెసర్ ఇలా అన్నారు.

"ఇప్పుడు చర్చించబోయే విషయాలు మనలో అందరికీ బాగా తెలిసినవే అనుకుంటాను."

అతని మాటలకు అవునని తలూపాం.

"అయితే, ఇప్పుడు మనం ఎదుర్కోబోయే శత్రువు గురించి కొంత చెప్పటం మంచిది. మీకు అతని చరిత్ర తెలియటం ఎంతో అవసరం. దీన్ని నా కోసం ఒకరు సేకరించి పెట్టారు. తర్వాత మనం ఎలా ముందుకు సాగాలి, మనం కార్యక్రమం ఎట్లా నిర్వర్తించాలి అన్న విషయం చర్చిద్దాం."

"డ్రాకులా లాంటి మనుషులు వుంటారు. వాళ్ళు భూతాలు. అటువంటివి వుంటాయని మనలో కొందరికి అనుభవమే. మన స్వంత అనుభవాలేకాక, మనం తయారు చేసిన రికార్డు చదివినా కూడా, అర్థం చేసుకోవచ్చు. చెప్పొద్దూ, మొదట్లో నేను కూడా అంత నమ్మేవాడ్ని కాదు ఈ విషయం. నేను ఎంతో బాగా ఆలోచించి, నా మనసుకు నచ్చజెప్పకుని, ఒక నమ్మకానికి వొచ్చాను. ఇప్పుడు తెలిసినన్ని విషయాలు నాకు ముందే తెలిసి వున్నట్టయితే, ఒక నిండు ప్రాణాన్ని నిలబెట్టగలిగి వుండేవాడ్ని. కానీ అది మన చేతులు దాటిపోయింది. ఇప్పుడు మనం చెయ్యాల్సింది ఏమిటంటే, కనీసం మిగిలిన ప్రాణాలు బలికాకుండా చూడాలి. అతన్ని చంపాలంటే, ఈగను చంపటంలాంటింది కాదు. అతను దాదాపు ఇరవై మనుషులబలం గలవాడు. చాలా తెలివైనవాడు. చనిపోయినవాళ్ల ఆత్మల సహాయం అతనికి వుంటుంది. జరగబోయే విషయాలను అతను వాటిని అడిగి తెలుసుకుంటాడు. గొప్ప మోసగాడు కూడా. అతనికి హృదయం అంటూ వుండదు. అతను ఎక్కడ కనపడాలనుకుంటే అక్కడ కనపడగలడు. అతనికీ కొన్ని హద్దులు వున్నాయనుకోండి. ప్రకృతిలో కొన్నిటిని అతను శాసించగలడు కూడా. ఉప్పెన తెప్పించగలడు. పొగమంచు రప్పించగలడు. ఉరుములు వినిపించగలడు. వీటితో ఎంత భీభత్సం చెయ్యాలో అంతా చెయ్యగలడు. చిన్నచిన్న జంతువుల్ని ఆకట్టుకోగలడు. ఎలుక, గుడ్లగూబ, గబ్బిలం, నక్క, తోడేలు ఇట్లాంటివి. అతను శరీరాన్ని పెంచుకోగలడు, తగ్గించుకుని చిన్నవాడూ కాగలడు. ఒక్కొక్కసారి అదృశ్యరూపంలో తిరగగలడు. ఇట్లాంటి శక్తి యుక్తులు గలవాడ్ని మనం ఎట్లా చంపగలం ? మిత్రులారా! ఇది చాలా కష్టతరమైన పని. ప్రమాదంతో కూడుకున్నటువంటిది. ఎంత ధైర్యశాలి అయినా, వణికిపోక తప్పదు. ఇందులో మనం ఓడిపోయామంటే, అతనికింక పట్టపగ్గాలుండవు. ఇక మన సంగతి ? ప్రాణాలు వదులుకోవాల్సిందే. పోతేపోయినయి, అల్పప్రాణాలు. అతనికి తలవొగ్గేది లేదుగాని, మనం ఓడిపోతేమాత్రం, మనం చచ్చి అతనిలా తయారవుతాం, దయ్యాలయి అతనికి సహాయంచేస్తూ వుంటాం. అప్పుడు మనకు హృదయంగాని, మంచిగురించి ఆలోచనగానీవుండవు. మనం ఇక ఆ నరకంలో పడివుండాల్సిందే. మనకిక స్వర్గానికెళ్లే రాతవుండదు. మనం దేవుడ్నినమ్ముకుని కార్యరంగంలోకి దూకాలి. ఆయనే మనల్ని కాపాడతాడు. మన విధినిర్వహణ మనం చెయ్యాల్సిందే. ఇంతవరకూవచ్చి, వెనక్కి తగ్గుతామా ? నన్ను అడిగితేమాత్రం, తగ్గనంటాను. నేను ముసలాడ్ని. దేవుడికి అతిచేరువులో వున్నవాడ్ని. కానీ మీరు ? వయసులోవున్నవారు. మీలో కొందరు విషాదాన్ని చవిచూసినా, ఇంకా అనుభవించవలసిన వయసువుంది. కాబట్టి మీ అభిప్రాయం చెప్పండి."అన్నాను.

ఆయన అట్లా మాట్లాడుతుంటే, జోనాధన్ నా చెయ్యిపుచ్చుకున్నాడు. నాకు చాలా భయం వేసింది, ప్రొఫెసర్ అట్లా మాట్లాడుతుంటే. కానీ జోనాధన్ స్పర్శవల్ల ధైర్యంవచ్చింది. అతను ఎంతో బలంగలవాడు, ధృఢమైన మనస్తత్వంగలవాడుమరి.

ప్రొఫెసర్ మాట్లాడ్డం ఆపిన తర్వాత నా భర్త నా కళ్ళలోకి చూసాడు. నేను-అతని కళ్లల్లోకి చూసాను. మా చూపులే మా ఇద్దరి మధ్య మాటలు.

''నేనూ, మినా సిద్ధమే''అన్నాడు జోనాధన్.

''నన్నుకూడా లెక్కవేసుకోండి'' అన్నాడు మోరిస్ తన మామూలు ధోరణిలో.

''నేనుకూడా సిద్ధమే. వేరే కారణం లేక పోయినా, నా లూసీకోసం'' అన్నాడు ఆర్థర్.

డాక్టర్ సెవార్డు మాత్రం చిన్నగా తలూపాడు. ప్రొఫెసర్ లేచి నిలబడ్డాడు. తన బంగారపు శిలు వను టేబులుమీద వుంచి, చేతులు ముందుకు చాపాడు. నేను అతని కుడిచెయ్యిని పుచ్చుకున్నాను ఆర్థర్ ఆయన ఎడంచేతిని పుచ్చుకున్నాడు. జోనాధన్ నా కుడిచెయ్యిని అంది పుచ్చుకుని, తన కుడిచేతిని మోరిస్‌కు అందించాడు. ఒకరి చేతుల్లో ఒకరు చేతులువుంచి గుండ్రంగా నిలబడ్డాం. ఒట్టు






బులుసు వేంకటరమణయ్య

# యాచనలో చమత్కారం

కవిత్వ ప్రియుడైన భోజరాజు దగ్గరకు ఒక వైదిక బ్రాహ్మణుడు వెళ్లి, తానూ ఒక కవిని అంటూ "భోజనం దేహి రాజేంద్ర ఘృతసూప సమన్వితం" అని తనకు పప్పు నేతులతోడి భోజనం కావాలని కవిత్వం చెప్పాడట. కాళిదాసు చమత్కారంగా "మాహిషంచ శరచ్చంద్ర చంద్రికా ధవళం దధి" అని పూర్తి చేశాడు. "శరత్కాలపు వెన్నెలవలె ఉన్న బర్రె పెరుగుతో కూడా" అని దాని అర్థం. ఆ రెండో భాగానికే మెచ్చుకొని భోజుడు గొప్ప బహుమానం ఇచ్చాడట! అందువల్ల — ఒక ప్రభువును యాచన చెయ్యడంలో చమత్కారం వుంటేనే కోరిక నెరవేరి ధనం ముడుతుంది. యాచనలో అయినా చమత్కారం ఉండాలి. ఒక సరసుడైన మహాకవి ఒక ప్రభువు వద్దకు యాచనకు వచ్చి చమత్కారమైన ఒక శ్లోకం చెప్పాడట ఇలాగున —

"అర్థం దానవ వైరిణా గిరిజయా
ప్యర్థం శివస్యాహృతం.
దేవేత్థం జగతీతవే పురహరా
భావే సముస్మీలతి,
గంగా సాగర మంబరం శశికళా
నాగాధిపః క్ష్మాతలం
సర్వజ్ఞత్వ మధీశ్వరత్వ మగమత్
త్వాం మాంచ భిక్షాటనమ్."

దీని అభిప్రాయం ఏమంటే —

హరిహరనాథుడిలో సగం భాగం శివుడూ, సగం శరీరం విష్ణువూ. అర్ధనారీశ్వరుడిలో సగం శరీరం శివుడూ, సగం శరీరం పార్వతియున్నూ — ఈ విధంగా శివుని దేహంలో సగం నారాయణుడూ, సగం పార్వతీదేవి అపహరించగా శివుడు లేకుండాపోయాడు. ఆధారమే లేనప్పుడు, ఆ శివుణ్ణి ఆశ్రయించి వున్న గంగ, చంద్రకళ, సర్పరాజు, అతని గుణాలు సర్వజ్ఞత, ప్రభుత్వం, భిక్షాటనం తలొకదాన్ని ఆశ్రయించవలసి వచ్చింది. గంగ సముద్రానికి పోయింది. చంద్రకళ ఆకాశాన్నాశ్రయించగా, పాము భూవివరంలో దూరింది. సర్వజ్ఞత్వం, ప్రభుత్వం, ఓ రాజా! నిన్ను ఆశ్రయించాయి. ఇంక — మిగిలిన భిక్షాటనం నన్ను ఆశ్రయించింది — అంటే నేను యాచన చేసి బ్రతుకవలసి వచ్చింది.

ఇందులోని యాచన ఎంతో చమత్కారంగా వున్నది కదా? ఈ చమత్కారాన్ని గ్రహించిన రాజు ఆ విద్వాంసుణ్ణి సంతోష పెట్టకుండా ఎలా ఉంటాడు?

మాటలలో చమత్కారం ఉంటే సరి, ఏ పనినయినా సాధించడం సాధ్యమవుతుంది. ★

---

వేసాం. నాకు చాలా భయంగానేవుంది. చేతులు చల్లబడ్డాయి. అయినా ఇట్లాంటి పరిస్థితిలో వెనక్కి తగ్గకూడదనుకున్నాను. ఎవరి స్థలాల్లో వారు కూర్చున్నాం. డాక్టర్ వాన్‌హెల్సింగ్ మొహం సంతోషంగా కనిపించింది. అంటే కార్యక్రమం మొదలయినట్టే. ఈ వ్యవహారం అంతా ఏదో వ్యాపార విషయంలా తీసుకుని చురుకుగా పని చెయ్యాలి.

"సరే, మనం అంతాకలిసి ఎవరితో పోరాడాలో మీకు తెలిసిందే. మనకీ కాస్త బలం వుంది. మనం దరికీ ఒక్క గొప్ప శక్తివుంది. అది దయ్యాలకుండదు. మనకు సైన్సు అందుబాటులో వుంది. మనం ఆలోచించడానికి బుర్రవుంది. దాని ప్రకారం నడుచుకునే స్వేచ్ఛవుంది. మనం పగలు ఎలా తిరగగలమో, రాత్రిపూటకూడా తిరగగలం. ఇవన్నీ దయ్యాలకు లేని శక్తులు. మనకీ ఈ శక్తులు పోయేవికావు. వీటిని వాడుకునే స్వేచ్ఛవుంది. మనలో విధి నిర్వహణమీద నమ్మకం వుంది. దానిలో నిస్వార్థం వుంది. మనం అనుకున్నది సాధించటానికి ఈ శక్తులు చాలా తక్కువ.

ఇకపోతే మనం కొన్నివిషయాలు పరిశీలిద్దాం. ఈ ప్రకృతిలోవున్న కొన్ని విషయాలు మనకి ఎంత వరకు ఉపయోగకరమో చూద్దాం, అట్లాగే దయ్యాలకున్న పరిమితమైన శక్తులు పరిశీలిద్దాం. ముఖ్యంగా డ్రాకులాకున్న పరిమిత పరిస్థితులు ఏమిటో చర్చిద్దాం.

ఇప్పుడు మనమంతా సంప్రదాయసిద్ధమైన విషయాలమీద, కొన్ని మూఢనమ్మకాలమీద పోవాలి.

## జీవన్మృతులు

మనిషి జీవించటం, మరణించడం విషయాలు తీసుకుందాం. సంప్రదాయాలు, మూఢనమ్మకాలు అన్నీ వీటిమీదనే ఆధారపడ్డాయి. దయ్యాల సంగతికొస్తే, నమ్మటం కష్టం. సైన్సు పెరిగి, సందేహాలను మనసులలో, హేతువాదాలతో ఈ కాలం వుంది. కానీ మనం మనకళ్లతో దయ్యాన్ని చూసాం. కాబట్టి నమ్మాలి. అతనికున్న పరిమితులు, అతన్ని ఎలా వదిలించుకోవాలో, మూఢనమ్మకాలమీద ఆధారపడి ఆలోచించాలి. ఎందుకంటే, అతని గురించి అన్నిదేశాల్లోనూ తెలుసు. పూర్వం గ్రీస్, రోముల్లో అతని గురించి తెలుసు. జర్మనీ అంతా అతను తెలుసు. ఫ్రాన్స్, ఇండియా, చెర్‌నోసీస్, చైనాల్లో కూడా అతని గురించి తెలిసిన వాళ్లున్నారు. మనకీ తెల్సుకదా. జనం అతనంటే భయపడతారు. మనకీ అది అనుభవమే. అతను వున్నాడు. కాలం గడిచిన కొద్దీ అతను వయసుమీరి చనిపోవటం అనేదిలేదు. జీవించి వున్న మనుషుల రక్తం తాగి అతను బలాన్ని పుంజుకుంటాడు. అతను మంచి వయసులో వున్న వాడిగా కూడా కనపడతాడని మనలో కొందరు చూసారు. అతని కడుపు నిండితే అట్లా కనపడతాడనిపిస్తుంది. అంటే దీన్నిబట్టి ఆ ఆహారం లేకపోతే అతను వుండలేడని తెలుస్తోంది. మన మిత్రుడు అతనితో కొన్ని వారాలు గడిపాడు. మరి అన్నిరోజుల్లోనూ అతను ఏదైనా ఆహారం తినటం చూడలేదు. అతని నీడ వుండదు. అద్దంలో ప్రతిబింబం కనపడదు. ఇది కూడా జోనాథన్ అనుభవం వల్ల తేలిందే. జోనాథన్ ఉద్దేశపడినట్టుగా, అతని చేతిలో గొప్పబలం వుంది. అతను తోడేలుగా మారగలడు. విట్‌బీకి కొట్టుకొచ్చిన ఓడలోంచి పారిపోయినది ఆ తోడేలే! దారిలో ఒక కుక్కను చీల్చిపారేసింది. అతను గబ్బిలంలా కూడా మార్పు చెందగలడు. మేడమ్ మినా, లూసీ ఇంటి కిటికీలో చూసిన గబ్బిలం అతనే. మన మిత్రుడు జాన్ కూడా, పక్కఇంట్లో దాన్ని ఎగురుతుండగా చూసాడు. అతను పొగమంచు సృష్టించి వస్తాడు. ఓడ నడిపిన కెప్టెన్ రాసుకున్న దాన్నిబట్టి తెలుస్తోంది. ఆ పొగమంచు కూడా తన చుట్టూరా మాత్రమే సృష్టించగలడు. ఎక్కువదూరం అది వుండదు. రాత్రిపూట వెన్నెల్లో గాలి రూపంలో రావచ్చు. జోనాథన్ డ్రాకులా కోటలో ఆడ దయ్యాలు అలా రావటం చూసాడు. అతను ఎంత సూక్ష్మరూపం అయినా ధరించగలడు.

దయ్యం రూపంలో వున్న లూసీ వెంట్రుకవాసి అంత తలుపు సందుల్లోంచి సమాధి లోపలకి వెళ్లగలిగింది. అతను ఒకసారి దారి కనిపెట్టిన తరువాత ఎటువంటి ప్రదేశం లోపలికైనా వెళ్లగలడు, బయటకు రాగలడు, మనం ఎంతగట్టిగా తలుపులు బంధించినా సరే. మంటలు కూడా అతన్ని ఏమీచేయలేవు. అతను చీకట్లో చూడగలడు. ఇది సామాన్యమయిన శక్తి కాదు. సగం ప్రపంచం చీకట్లోవున్నప్పుడు అతను చూడగలుగుతున్నాడంటే, అది ఎంత గొప్పశక్తి!

ఇప్పుడు నే చెప్పేది జాగ్రత్తగా వినండి...

(ఇంకా వుంది)

# ఘాటాక్షుని డైరీ



## వింత ఊరేగింపు !

మారత్‌లో మొన్న వో బహు చక్కని వూరేగింపు జరిగిందట. అందులో అయిదేళ్ళనుంచి పదకొండేళ్ళు వయస్సులోవున్న ఆడ మగా పిల్లలను నగ్నంగా వూరేగించారట. దీనర్థం అని అడిగితే గత 33 ఏళ్ళుగా భారద్దేశమింతకన్నా ఏమిటి వూడబొడిచింది అని ఆలిండియా యూత్ ఫెడరేషన్ ఎదురు ప్రశ్నించిందట.

## చేయని నేరానికి శిక్ష !

రాజేంద్రకుమార్ కామత్ అనే 23 ఏళ్ళ యువకుడు సైన్యంలో చేరడానికి ప్రథమ ప్రయత్నంగా ధన్‌బాదుకు పోయిన జనవరి 20వ తేదీకి వెళ్ళాడట. ఇంటర్వ్యూ జనవరి 27వ తేదీకి పొడిగించేసరికి ఇహ ఆ వూళ్ళోనే ఆ ఏడ్రోజులూ వుండిపో నిశ్చయించుకున్నాడట. ధన్‌బాద్‌లో భారత్ కుక్కింగ్ కోల్ లిమిటెడ్‌లో సీనియర్ సేల్స్ ఆఫీసరుగా పనిచేస్తున్న జి. పి. సింగ్ ఇంట్లో అతను కొన్నేళ్ళక్రితం కొన్నాళ్ళు డ్రయివరుగా పనిచేశాడట. అలనాడు సింగ్‌గారు యీతడికి కొంత డబ్బు బాకీ పడ్డాడటకూడాను. దాంతో ఆయనింటికి రాత్రి పది గంటల ప్రాంతంలో వెళ్ళి "సార్, సాబ్" అని అరిచాడట. దాంతో లోపల్నుంచి సింగుగారు, రాజా అనే వో పనివాడూ దొంగ దొంగో అని అరుస్తూ అతనిమీదపడి, అతని రెక్కలు విరిచికట్టి, చితకబాది, అంతలోఆగక, వో సీసాలోని ద్రావకం తెచ్చి అతని కళ్ళలోనూ, నెత్తిమీదా పోశారట. ఆనక సింగ్‌గారి ఆగంతకుడు తనమీదికి దౌర్జన్యానికి వచ్చాడని పోలీసులకు తెలియజేసి, కేసు రిజిస్టరు చెయించాడట. పోలీసులు అరెస్టుచేసి దిక్కులేనిచోట పారేస్తే అతనితమ్ముడు సుపార్శ్వనుల్ యస్. పి. లాల్ అనే వో లాయరుసహాయంతో తన అన్నగారికి ప్రభుత్వఆసుపత్రిలో వైద్యసౌకర్యం కలిగించగలిగాడట. పాట్నా మెడికల్ కాలేజి ఆసుపత్రికి తరలించి, ఆనక తిరిగి అతన్ని మార్చి 7వ తేదీన పోలీసు ఆసుపత్రికి తరలించారట. డబ్బూ, పలుకుబడి రాజ్యమేలే ఈ రోజులలో న్యాయంవెళ్ళి అట్టివారి జేబుల్లో దాక్కున్నపుడు దాన్ని బయటకు తీయడం మాటలా ?

## అనుమానం - హత్య !

కర్నాటకకు చెందిన వెల్లిబొట్ల అనే గ్రామంలో అంజినప్ప అనే అతను తన భార్య ముద్దలింగమ్మ శీలాన్ని అనుమానించి ఆమెను ఆమె అమ్మగారింట్లో వదిలేసి, ఆనక వారానికి వోసారి వెళ్ళి చూసేవాడట. తన అనుమానం రానురానూ పెద్దదవడంవల్ల అనుమానం పగగా, పగ కసిగా మారి దాంతో ఆమెకు మాయ మాటలు చెప్పి ఆమెను హిందూపురానికి దగ్గర్లోఉన్న కొట్నూరుకు తీసుకువెళ్ళి అక్కడో ఎండిపోయిన చెరువువద్ద ఆమెను రాయితో కొట్టి చంపి, తల పగలేసి, జుట్టుగొరిగి, ముఖం పచ్చడిచేసి, నగలు తీసుకు చక్కా పోయాడట. ఇది డిసెంబరు పద్నాలుగో తేదీన జరిగిందట. ఇప్పుడిది బయటపడి అంజినప్ప జైలుపాలయ్యాడట.

## ఏటా సినిమాలకి వెయ్యికోట్లు !

భారతదేశంలోవున్న పన్నెండుమిలియను జనాభా దేశంలోవున్న సుమారు పదివేల సినిమాహాలులకు రోజుకు నాలుగు, అయిదాటలకూ విజయం చేస్తూ సుమారు వెయ్యికోట్లరూపాయలు ఖర్చు చేస్తున్నారో ఏటికిఅట.

## పోలీసులు చేసిన పెళ్ళి !

సేలం సూరమంగళంలో 21 ఏళ్ల శివానందం ఎదురింటి పిల్ల 18 ఏళ్ల ఆనందినిని దినదినమూ కిటికీలోంచి చూసి, ఘాటుగా ప్రేమించి, ప్రేమింపచేసుకుని ఆనక ఆమెతో కలిసి చెట్లూ పుట్టలూ పట్టి ప్రేమించుకోడం ఆరంభించాడట. దానికి ఆనందిని అన్న మాసిలామణి అడ్డుపెట్టి కాళ్లువిరగదంతానని,అన్నంతలో ఆమెకు కాస్త శాంపిలు చూపి, మరంత శాంపిలు శివానందానికి చూపాడట. ఇద్దరూకలసి, గచ్చపప్పో, నల్లుల మందో త్రాగి చద్దామనుకున్నారట. శివానందం మార్గాంతరం ఆలోచించి, పోలీస్టేషనుకు వెళ్ళి వివరంగా యీ కథ చెప్పి తాను, ఆమె మైనారిటీ తీరిన వారమని వివరించి, ఇనస్పెక్టరుసహాయం కోరాడట. ఇనస్పెక్టరు కృష్ణన్ ఆనందినిని, ఆమె తల్లి దండ్రులను, అన్నను పిలిపించి, విచారించి, నచ్చచెప్పి, వప్పించి, తన పోలీస్టేషనులోనే వారిద్దరికి మాలలుమార్పించి పెళ్ళితంతు చేసి, మీ రిద్దరూ యిహ, పురుషన్-పొండాటి- పొండి అన్నాడట.

## ఏనుగుల ఆటల పోటీలు !

థాయ్‌లాండ్‌లో ప్రతి ఏడూ ఏనుగులకు ఆటల పోటీలు పెడ్తారట. ఈ ఆటల పోటీలలో ఏనుగుల పరుగు, బరువు ఎత్తడం, ఫుట్‌బాలు ఆట, బ్యాస్కట్‌బాలు ఆటలేగాక 'టగ్ ఆఫ్ వార్' అనే తాడు లాగడం ఆట చాలా వినోదంగా వుంటుందట. తాటిని ఒక ఏనుగు వొక పక్క పట్టుకుంటే రెండో కొసన వందమంది మనుష్యులు పట్టుకుని లాగుతారట. చివరికి ఏనుగే గెలుస్తుందట. ఈ ఆటలు చూడ్డానికి జనం విరగబడ్తారట !

## 761 సంవత్సరాలు నడిచిన కేసు !

పూనాకు చెందిన బాలాసాహెబ్ పట్లోజి థోరత్ అనే ఆయన తాత ముత్తాతలు అలనాడు ఏదో వో తగాదాల కేసు కోర్టులో పెడితే 1966 ఏప్రియల్ 28వ తేదీన అది ఇపుడు ఈయనపరంగా తీర్పు వచ్చిందట. 1205లో మలోజీ థోరత్ మత సంబంధమైన వేడుకలలోను, పబ్లిక్ వేడుకలలోనూ తనకున్న హక్కు నిరూపించుకోడానికి కోర్టుకెక్కితే అది 761 సంవత్సరాల తర్వాత తీర్పుకు వచ్చిందట - లా పుట్టన్నాళ్ళాయనా ! ★



వైజాగ్ "ఆసు పాసు" లో సముద్రం లో "తేలు" పడింది!!







# సృష్టికర్త

## కె.కె. రఘునందన

ఒక్కసారి భారంగా నిట్టూర్పి ఒత్తిగిలి పడుక్కున్నారు చలపతిరావు మేష్టారు. హాస్పిటల్ అంతా నిశ్శబ్దంగా సుషుప్తిలోకి జారుకుంటోంది. అప్పుడప్పుడు మనుషుల అలికిడి అస్పష్టంగా వినిపిస్తోంది.

మేష్టారు కనులు తెరిచినా...మూసినా చీకటే కనిపిస్తోంది. కాని ఆ చీకటి ఉండేది ఈ ఒక్క రోజే! రేపే తనకు వెలుగొస్తుంది... తను లోకం చూడగలిగే శుభ సమయం ఆసన్నమౌతోంది.

ఆ ఆలోచన రాగానే చలపతిరావుగారి హృదయం ఆనందంతో సాగరంలా పొంగి పొరలుతోంది. దాని వల్ల మనసు అక్వేరియంలోని చేపపిల్లలా అనిశ్చలంగా, భావాల సంఘర్షణలో, అల్లిబిల్లిగా తిరుగాడుతోంది.

ఏ కోణంలోంచి చూసినాసరే తనకు అర్థం కాని విషయమే గోచరిస్తోంది.

ఔను! తనకూ డాక్టర్ యోగీంద్రకూ ఏమిటి సంబంధం? అసలు తన భయంకరమైన అంధత్వాన్ని వెలుగుమయం చేయ సంకల్పించడానికి అతనికి ఏం పట్టింది? యింతకీ ఆ మహానుభావుడికి తనపై ఏమిటి ఈ అవ్యక్త అనురాగ పరంపర? తనని ప్రతిక్షణం కనిపెట్టుకు తిరుగుతున్న ఈ కరుణామయుడి వింత ధోరణి ఏమిటసలు?

ఎలాగైనా తను అదృష్టవంతుడన్నది వాస్తవం.

ఐదేళ్ళక్రితం తనకు శుక్లాలువచ్చి కళ్ళు పోయినప్పుడు తనెంత బాధపడ్డాడో... ఈనాడు తనకు దృష్టి వస్తుందని చెప్పినప్పుడు అంతకు పదిరెట్లు సంతోషించాడు.

దానికి కారకుడు డాక్టర్ యోగీంద్ర!!

ఈ జీవన ప్రయాణంలో తనకింతవరకూ ఎందరో మనుషులు తారసపడ్డారు. ఆ మనుషుల్లో ఎన్నో యిరుకు మనసుల్ని, సంకుచిత స్వభావాల్ని, దుష్టవ్యక్తిత్వాలనీ... గమనించాడు. కానీ మంచితనం యింకా మనుషుల మనసుల్లో మంటగలసిపోలేదని, మానవత్వపు విలువలు యింకా దిగజారిపోలేదని, నిరూపించిన మహోన్నతుడు డాక్టర్ యోగీంద్ర!

మొట్టమొదటిసారిగా తన జీవితంలో తొలకరి జల్లు కురిపించిన మహనీయుడు యోగీంద్ర తన వద్దకు వచ్చిన సందర్భం, అతను చెప్పిన మాటలకు తనలో నిండుకున్న తృప్తి ఒకదాని వెంట ఒకటి గుర్తుకొచ్చాయి, చలపతిరావు మేష్టారికి.

* * *

ఆ రోజు...

ఎవరో తలుపుతీసుకుని వచ్చిన చప్పుడైంది.

"ఎవరూ!" అంటూ నెమ్మదిగా పిలిచారు మేష్టారు.

"మీరేనా చలపతిరావు మేష్టారు!" అంటూ ప్రశ్నించిన గొంతు యువకుడిదని పోల్చారు మేష్టారు.

"ఔను నేనే! అయినా నాతో ఏం పని? నాతో పని ఉన్న వాళ్ళు యింకా ఈ లోకంలో ఉన్నారంటే ఎంతో ఆశ్చర్యం వేస్తుంది నాకు. ఎందుకంటే జీవితంలో అందరినీ పోగొట్టుకుని అంధుడిగా మిగిలిపోయిన నా బ్రతుకులో నిరాశ,



నిస్తేజం తప్ప ఏం లేవు. నా గొడవ చెప్పి మిమ్మల్ని విసిగించి ఉంటాను... యింతకీ మీరెవరో చెప్పారు కారు. యిలా కూర్చోండి...'' అనిచెప్పి తన ప్రక్క-మీద కూర్చోమని సైగ చేసారు చలపతిరావుగారు.

''నా పేరు యోగీంద్ర. నేను క్రొత్తగా ఈ ప్రక్క వీధిలో నా ప్రాక్టీసు ప్రారంభించాను. నేను ఐ స్పెషలిస్టుని. నా వృత్తిలో ప్రధానభాగం జీవితం చివరి తీరంలో అంధకార బంధురంలో అల మటిస్తున్న వారిని సేద తీర్చి, వారికి చేయూత నందించి చూపు తెప్పించి ఆదుకోనటం. అందుకే నేనీ వృత్తిని ప్రారంభించానంటే ఈ రోజుల్లో ఎవరూ నమ్మశక్యం కాని విషయం. కాని నేను చెప్తున్నది అక్షరాలా నిజం.'' కూర్చొన్నాక తన ధ్యేయం వివరించి చెప్పాడు యోగీంద్ర.

''అసలు మీకు చూపు ఎప్పుడు పోయింది... మీరు అంగీకరిస్తే, మీకు దృష్టి తెప్పించే బాధ్యత నాది. ఏమంటారు'' సవినయంగా మళ్లీ అన్నాడు యోగీంద్ర.

''నాయనా! నువ్వెవరివో కాని నా కళ్లకు కాంతిని ప్రసాదిస్తానంటున్నావ్. నేను అదృష్టవంతుడినైతే చూపు నీ చేతులు మీదుగా రావాలి, అని జవాబిచ్చి చిరునవ్వు నవ్వారు మేస్టారు.

వెంటనే యోగీంద్ర చలపతిరావు మేస్టారిని తీసుకుని తన క్లినిక్‌కి వెళ్లాడు.

ఆ సాయంత్రమే కొన్ని పరీక్షలు జరిపి దృష్టి వస్తుందని నిర్ధారించగానే మేస్టారి హృదయం ఆనందంతో ఉవ్వెత్తున ఎగిసి వెయ్యింతలై వెలిగింది.

* * *

# సృష్టికర్త

ఆపరేషన్‌కి అన్నీ సిద్ధం చెయ్యబడ్డాయి.

తెల్లవారితే ఆపరేషన్!

తనకు చూపొస్తుంది, అప్పుడు తను ఎక్కడైనా ఒంటరిగానే వెళ్లగలడు. 'గుడ్డి మేస్టారన్న' మారు పేరు మాసిపోతుంది.

గాలిపటం లాంటి మనసు ఆలోచనల దారంతో విహరిస్తుండగా – 'మేస్టారూ!' అన్న యోగీంద్ర పిలుపుకు పుటుక్కున తెగిపోయింది.

''ఏం బాబూ!'' అన్నారు ఆతృతగా.

''మీరు సిద్ధమేనా! యింక ఆపరేషన్ జరిగే టైము దగ్గర పడిందిలెండి'' అని చెయ్యి పట్టుకుని నడిపించుకుని ఆపరేషన్ థియేటర్‌లోనికి వెళ్లాడు యోగీంద్ర.

* * *

ఆపరేషన్ సక్సెస్ అయింది.

చలపతిరావు మేస్టారి గ్రుడ్డి జీవితం అంతమై క్రొత్త వెలుగు వచ్చింది. కట్లు విప్పేముందు మేస్టారికి ఒక కోరిక మనసులో మొలకెత్తింది.

ఇన్నాళ్ల ఈ నిస్తేజపు బ్రతుకులో ... ఒంటరి జీవితంలో వసంతం నింపిన దేముడులాంటి యోగీంద్రను మొట్టమొదటగా చూడాలి ... అదే తన హృదయంలో రెపరెపలాడుతున్న కోరిక.

నెమ్మదిగా విప్పుకున్నాయి కళ్లు.

చాలా యేళ్ల తదుపరి లోకమంతా ప్రకాశవంతంగా కనిపించింది. ఆ కాంతిలో డాక్టర్ యోగీంద్ర అడక్కుండా వరమిచ్చిన భగవంతుడై సాక్షాత్కరించాడు.

అపరిమితానంద భరితమైన చలపతిరావుగా ఆత్మ పరవశించిపోయి కన్నులనీరు, హృదిలో హర్షం నిండుకుంది.

''బాబూ! నువ్వు మామూలుమనిషివికావు.. మానవత్వపుశిఖరాల్ని చేరుకున్న అగ్రగణ్యుడివి.' అన్నప్పుడు మేస్టారిమనసు పులకింతలతో ఊగిసలాడింది.

''మేస్టారూ! నేను చేసినసేవ ఏముందిలెండి. ఇది నా కర్తవ్యం... నా ధ్యేయం... ఆపై దైవ కృప...'' అన్నాడు యోగీంద్ర మేస్టారివంక గౌరవంగాచూస్తూ...

''లేదు బాబూ ఆ కనిపించనిదేవుడు నాకిప్పుడు నీవు కనిపిస్తున్నాడు... నాకూ నీకూ పరిచయం లేకపోయినా నువ్వు నాపై ఎందుకో ఈ అవ్యాజ్య అనురాగాన్ని కురిపించి నా బ్రతుకువీణను పలికించావు.''అని ఆప్యాయంగా యోగేంద్రను గుండెలకు హత్తుకున్నాడు.

''లేదు మేస్టారూ! మీకూ నాకూ ఋణం ఉందికనుకనే ఈ విధంగా జరిగింది...''

''అంటే...?'' మేస్టారిలో సంశయం జనించగా అడిగారు.

''మీకింకా అర్థం కావటంలేదు మేస్టారూ! మీ చేతిచలవవల్ల ఈనాడు నేనీ డాక్టర్అనే పవిత్ర వృత్తిని చేపట్టి లోకంలోనిలిచిన నా ప్రగతికి,పునాది మీరేనంటే మీకు ఆశ్చర్యంకలగచ్చు... ఆనాటి 'అలుగోలు' చలపతిరావు మేస్టారిగా నాకేకాకుండా

ఎంతోమందికి మీరు గుర్తు... కారణం మీ మంచితనం, అభిమానం... ఆ రోజుల్లో మీరు నాకుచేసిన మేలు మరుపురానిది. అందువల్ల నే నెంత ఋణపడి ఉన్నానో నాకు తెలుసు. ఆ ఋణం తీర్చుకునేందుకు యింత మంచి అవకాశం ఈ విధంగా కలుగుతుందని కలలోకూడా ఊహించలేదు.'' అంటూ అనర్గళంగా చెప్పుకుపోయిన డాక్టర్ యోగీంద్రగొంతు అప్రయత్నంగా గాద్గదికమైంది. యోగీంద్రకళ్ళ చెమ్మగిల్లటం గమనించిన చలపతిరావుగారి హృదయం వెన్నలా కరిగింది.

''బాబూ ! ఎందుకలా బాధపడ్తావు ? నువ్వు ఏమిటి మాట్లాడుతున్నావో... నాకు ఏ మాత్రం అర్థంకాలేదు.'' అసలుసంగతి వివరించమని అడిగారు.

''మేస్టారూ ! మీకు నేను గుర్తుకురాలేదా ! నేను మేస్టారూ ! మీరు ''యింద్రా ! యింద్రా !'' అంటూ అనురాగంగా, ఆప్యాయంగా పిలిచిన యోగీంద్రను .... మీ యింట్లో ఉన్నది రెండు నెల్లే అయినాసరే మీ రిచ్చిన ఆతిధ్యం, ఆదరం మరచిపోలేనిది. నాకు పరీక్ష ఫీజు లేదంటే ...'' అని యింకా ఏదో గుర్తు చేయబోతూంటే అతన్ని ఆపి మేష్టారు అందుకున్నారు.

''ఔను బాబూ! ఇంద్రా ! గుర్తు కొచ్చావు... వెధవది వయస్సు పైబడి, జ్ఞాపకశక్తి తగ్గిపోయింది. నువ్వు అప్పుడు సన్నగా ఈనిపుల్లలా ఉండేవాడివి. అందుకే పోల్చలేకపోయాను. క్షమించు బాబూ ! అయినా నేను చేసిన సహాయం ఏమాత్రం ?''

క్రమక్రమంగా చలపతిరావుగారి మెదడులో గత స్మృతులు ఒక్కొక్కటే కదలాడ సాగాయి.

* * *

చలపతిరావు మేస్టారు అలుగోలు జిల్లాపరిషత్ హైస్కూలులో పనిచేసే రోజులవి. మేష్టారంటే అందరికీ భయం ఎంత ఉండేదో భక్తి కూడా అంతే ఉండేది. అలా అని ఎవరినీ దండించేవారు కాదు.

ఆ స్కూల్లోనే యోగీంద్ర చదువుకునేవాడు. తొమ్మిదో తరగతి వరకూ అతని చదువు బాగానే సాగింది.

యోగీంద్ర మేనమామ శివరావు అతనికి డబ్బు పంపేవాడు. కాని పదవ తరగతికి వచ్చేసరికి శివరావు డబ్బు పంపించటం మానేసాడు. అప్పుడే యోగీంద్రను పరీక్ష ఫీజు కట్టమని హెడ్మాస్టరు చెప్పారు.

దిక్కు తోచలేదు యోగీంద్రకు. వెంటనే పట్నం బయలుదేరాడు.

గుమ్మంలోనే ఎదురైన మామయ్య ఉంపుడుకత్తె లోపలకు యోగీంద్ర పాదం మోపీ మోపగానే —

''ఎందుకురా యిక్కడికి దాపరించావు ?'' అని కసిరింది.

''మావయ్య లేడా ? అర్జెంటుగా నలభై రూపాయలు కావాలి. ఒకటవతేదీ లోపుగా పరీక్ష ఫీజు కట్టాలి'' దీనంగా జెప్పాడు.

''మీ మామయ్య ఏమైనా యిక్కడ డబ్బుల చెట్లు మొలిపిస్తున్నారనుకున్నావా ? నీకు ఎప్పుడు కావాలంటే అప్పుడల్లా కుమ్మరించడానికి ...



వెళ్ళు .. వెళ్ళు నాయనా ! ఎక్కడ ముష్టెత్తుకుంటావో ముష్టెత్తుకో ! మళ్ళీ ఈ గడప తొక్కావంటే కాళ్ళు విరక్కొడతాను.'' అని యోగీంద్రను బయటకు పంపించి ధడేల్‌మని తలుపు వేసేసింది.

అమ్మలాంటి అత్త ఈనాడు బ్రతికుంటే తననిలా పొట్టి చేతులతో త్రిప్పి పంపేదా !!

అత్త చనిపోగానే యింటి పరిస్థితి ఎంత నీచంగా తయారైంది ??

మరేం చేసేది లేక వెనుతిరిగి పోయాడు యోగీంద్ర.

ఒకటవ తేదీ దగ్గర పడుతున్న కొద్దీ యోగీంద్రలో దిగులు ఎక్కువ కాసాగింది. ఎవరి నడిగినా లేదనే సమాధానమే వస్తోంది. స్కూల్లో పాఠాల మీద మనసు లగ్నం అయ్యేది కాదు.

సాయంత్రం పూట ఒంటరిగా గుడి దగ్గర కూర్చొనేవాడు. ఒక రోజు అలాగే కూర్చొని ఆలోచిస్తున్న యోగీంద్రను — ''ఏం బాబూ యిలా ఒంటరిగా కూర్చున్నావు. అరే కన్నీరు కారుస్తున్నావే ?'' అంటూ పలకరించి ఆప్యాయంగా దగ్గరకు తీసుకున్నారు చలపతిరావు మేష్టారు.

యోగీంద్ర దుఃఖం మరింత ఎక్కువైంది.

''ఎందుకు బాబూ ! ఎవరైనా ఏమైనా అన్నారా'' అని మరింత మృదువుగా ప్రశ్నించారు.

ఏడుస్తూ తన దీన స్థితిని వివరించి చెప్పాడు.

ఈ మాత్రం దానికిలా బాధపడ్డం తగదని ఓదార్చి తనతోపాటు యింటికి తీసుకెళ్ళాడు చలపతిరావు మేష్టారు.

మర్నాడే యోగీంద్ర పరీక్ష ఫీజు కట్టేసాడు.

* * *

''పెద్దవారు మీరు... దీవించాలి తప్ప యిలా నన్ను క్షమించమని అడక్కూడదు... ఆ రోజే నా చదువు కొడిగట్టిన దీపంలా అయిపోతే నేనేమయ్యేవాడిని ? నా బ్రతుకు ఈనాడెంత నికృష్టంగా ఉండేది. పదో పరగతి పాసైనాక రాత్రుళ్ళ కష్టపడి రిక్షా త్రొక్కి నా ఫీజులు కట్టుకుని చదువుకుంటూ యింత వృద్ధిలోకి వచ్చాను. అదంతా మీ చలవే ! అన్ని దానాల్లోకి విద్యాదానం పరమోత్కృష్టమైనదని లోకోక్తి. దాన్ని నాకు ప్రసాదించారు.'' అని ఒక్క క్షణం ఆగి మళ్ళా చెప్పటం ప్రారంభించాడు యోగీంద్ర.

''ఒక విషయం మీకు గుర్తుందో లేదో... మేం పదో తరగతి పాసైన రోజున నాతోటి సహాధ్యాయులైన నాయుడిగారబ్బాయి, కరణంగారి మనవడు, సుబ్బారావు మేస్టారి కొడుకు యింకా చాలా మంది పరీక్షలో ఉత్తీర్ణులైనందుకు కృతజ్ఞతగా మీకు గురుదక్షిణగా ఎన్నో కానుకలు సమర్పించారు. కాని నేను మాత్రం మీకేమీ యివ్వుకోలేని దౌర్భాగ్య స్థితిలో ఉన్నాను. అది చూసిన నాలో ఆ క్షణం రేగిన వ్యధ భరింపరానిది. ఆ నాటి నుంచి నేటి వరకూ ఆ బాధ నన్ను వెన్నంటి, వేధిస్తూనే ఉంది. నేను డాక్టర్ నైనాక మీ కోసం మన 'అలుగోలు' వచ్చాను. కానీ మీరు రిటైరైనాక ఎక్కడికి వెళ్ళారో తెలియదని చెప్పారు. తర్వాత నేనీ ఊళ్ళో ప్రాక్టీసు పెట్టడం, మీరీ ఊళ్ళోనే ఉన్నారని తెలియటం కాకతాళీయంగా జరిగింది. ఆ సమయంలోనే మీరీ దుస్థితిలో ఉన్నారని తెలిసింది. అందుకే మీకెలాగైనా చూపు తెప్పించాలని భావించాను. నేననుకున్నట్లే ఆపరేషన్ విజయవంతమైంది. ఒకప్పుడు నేను సమర్పించుకోలేని గురుదక్షిణ యిన్నేళ్లకు ఈ విధంగా తీర్చుకున్నందుకు నాకెంతో సంతోషంగా ఉంది. నేను ధన్యుణ్ని మేస్టారూ... నేను ధన్యుడిని.''

''ఇంద్రా ! నువ్వు నాకిచ్చినది ఉట్టి గురుదక్షిణ కాదు బాబూ ! ఇన్నాళ్ళూ చీకటిలో మ్రగ్గిపోతున్న నా జీవితానికి జ్యోతిని ప్రసాదించావు... నీ లాంటి శిష్యుణ్ని పొందిన నేను చాలా అదృష్టవంతుడిని...'' అంటూ ఆర్ద్రతతో నిండిపోయిన చలపతిరావు మేస్టారి కనులు ఒక్కసారి అశ్రువుల్ని వర్షించాయి. అవి ఆనందాశ్రువులు.

అది చూసిన యోగీంద్ర— ''మేస్టారూ ! ఈ జగానికి బ్రహ్మ ఎలా మూలపురుషుడో... విద్యార్థి జీవితానికి గురువు అటువంటివాడు. నా ఈ జీవితానికి సృష్టికర్త మీరే మేస్టారూ ?'' అలా అనగానే అతన్ని అత్యంత ఆప్యాయంగా బాహువుల్లోకి తీసుకుని అక్కున చేర్చుకున్నారు చలపతిరావు మేస్టారు. ★

# హైదరాబాద్ నోట్‌బుక్

## ముఖ్యమంత్రి పాదయాత్ర :

ముఖ్యమంత్రి శ్రీ ఎన్. టి. రా మా రా వు మార్చి 31 ఉదయం నగరంలోని తొమ్మిది మురికి వాడలలో ఉదయం ఏడున్నర నుంచి పదకొండున్నర గంటల వరకు పాదయాత్ర జరిపారు. ఫతేసుల్తాన్ లాన్ నేతాజీనగర్, పటేల్‌నగర్, న్రైహానగర్, ఖోలక్‌పూర్, రంగనగర్, మక్కామసీదు పక్కన మురికివాడ, నాయిక్‌నగర్, అమాన్‌నగర్ మున్నగు మురికివాడలను ఆయన చూచారు. మురికివాడలలో ముఖ్యమంత్రి తొలి పాదయాత్ర ఇదే. నిరాడంబరంగా ఈ పాదయాత్ర జరిగివుంటే బాగుండేది కాని, మంత్రులు, అధికారులు దాదాపు 50 కార్లలో ఆయన వెంట వుండడంవల్ల మురికివాడల ప్రజలు తమ గోడును ముఖ్యమంత్రికి తెలుపుకొనడానికి అవకాశం అంతగా దొరకలేదు నిజానికి జంట నగరాలలో మురికివాడలనేవి ప్రత్యేకంగాలేవు. రెండూ మురికివాడల సమాఖ్య. ముఖ్యమంత్రి ఆగాపూరా మున్నగు ప్రాంతాలను దర్శిస్తే చాలు. నగరం నడిబొడ్డు వంటి ఉస్మాన్‌గంజ్ ప్రాంతంలోని వీధులను చూస్తే చాలు. అవి పెద్ద పెద్ద మేడలున్న మురికివాడలు. పెంటకుప్పలు పేరుకు పోయి వుంటాయి. వర్షాకాలంలో అడుగు వేయ లేము చాలచోట్ల మ్యాన్‌హోలుల నుంచి పాతాళ గంగలు ఉబికి పారుతుంటాయి. ముక్కుపుటాలు అదిరిపోయే వాసన. దుమ్ము, ధూళి. సీతారాంబాగ్, దత్తాత్రేయ నగర్ వంటి ప్రాంతాలలో నడిరోడ్ల మీదే గుంటలు. ఎప్పుడో ఉస్మానలీఖాన్ నవాబు పరిపాలనలో వేసిన రోడ్లమీద అడుగెత్తున పేరుకొని పోయిన మురికిదిబ్బలు. అందువల్ల హైదరాబాద్ నగరమని, దానిలో కొన్ని మురికివాడలున్నాయని, వాటిని బాగుచేస్తే నగరం సుందరతరం, పరిశుద్ధతమం అవుతుందని భావించడం పొరపాటు. నగరమంతా మురికివాడే అనే నమ్మకంతో పెద్ద ఎత్తున పనులు సాగిస్తేగాని నగరం బాగుపడదు.

## రచన నృత్యరామణీయకం :

"కూకటి వేటితో కురులు గూడకమున్న -- అని చేమకూర వెంకటకవి చెప్పిన పద్యం ప్రసంగాంతరానికి సంబంధించినదైనా చిన్న వయసులోనే పెద్దలను ప్రతిభలోమించిన చిరంజీవిని బండారం రచనకు ఆ పద్యంలోని పై వాక్యాన్ని మాత్రం అన్వయిస్తాను. రచన 1974 జూన్ 8న జన్మించింది. అంటే ఇంకా తొమ్మిదేళ్ళు నిండనిది. సెయింట్ ఫ్రాన్సిస్ బాలికోన్నత పాఠశాలలో మూడవ తరగతి విద్యార్థిని. ఆదర్శ నర్తకికి కావలసిన ప్రతిభా ద్యోతకాలన్నీ ఆమెకు సమకూరాయి. ఇలాటి వారిని చూసే కాళిదాసు "ప్రపేదిరే ప్రాక్తన జన్మ విద్యాః" అన్నాడు రచన తలిదండ్రులు శ్రీయుతులు నళిని, గౌరీశంకరులు. సుప్రసిద్ధ రంగస్థల నటులు శ్రీ బండారు సుబ్రాజ్యోస్యులుగారు రచన పితామహులు. ఆయన చింతామణి, మధురవాణి, సత్యభామ, (రంగూన్ రౌడీలో) పద్మ పాత్రలను నిర్వహించారు. ఆ సంస్కారం రచనకు పరంపరంగా వుంది. రచన ప్రారంభంలో శ్రీమతి విజయలక్ష్మిగారి వద్ద నృత్య శిక్షణ పొందింది. తర్వాత శ్రీ పసుమర్తి రామలింగ శాస్త్రి (కూచిపూడి) గారి వద్ద కూచిపూడి నృత్య శిక్షణ పొందింది. రచన 1981 లో వయసీర్ డెలిగేషన్‌లో సభ్యురాలుగా సోవియట్ యూనియన్‌కు వెళ్లి, తన నృత్యప్రతిభతో మెప్పు పొందింది. జంట నగరాలలో ఆమె నృత్య ప్రదర్శనాలకు లెక్కలేదు. ఒక్క కూచిపూడి సంప్రదాయంలోనే గాక సకల నృత్యనాట్య సంప్రదాయాలలోను నిష్ణాతు లు కావాలని రచన వాంఛ. ఈ వాంఛ నెరవేరగలదని, గొప్ప నర్తకి కాగలదని ఏప్రిల్ 2వ తేదీన రవీంద్ర భారతిలో ఆమె ప్రదర్శించిన నృత్యమే సాక్ష్యమిచ్చింది. ఆమె సహజ సుందర రూపం భావస్ఫోరకమైన చెంపకు చేరడేసికళ్ళు, లయజ్ఞానం, గురువు వద్ద నేర్చిన దానిని సభాకంపం ఈషణ్మాత్రమయినా లేక ప్రదర్శించిన తీరు ఆమె ఉజ్జ్వల భవిష్యత్తును స్పష్టపరిచాయి ఆమె గణపతి స్తుతితో తన ప్రదర్శనం ప్రారంభించి, రాగమాలికలో పూజా నృత్యంచేసి యాదవ కృష్ణ గీతంతో దశావతారాలు అభినయించి, మండోదరీ శబ్దాన్ని చక్కగా అభినయించింది మండోదరీ శబ్దం అభినయం పట్టడం చాల కష్టం. కాని రచన, చిన్నపిల్లల ఆటలాగ అవలీలగా చేయడం ఆమె శిక్షణ ప్రాశస్త్యాన్ని తెలుపుతుంది. పిదప భామా కలాపం, తిల్లానానందనందన గోపాలతరంగం చక్కగా అ భి న యి ం చి ంది ఎనిమిదేళ్ల బాలికను మూడు గంటల కార్యక్రమంతో బాధపెట్టారా అనిపించింది నాకు. ప్రదర్శనానంతరం ఆమెను ప్రత్యేకంగా అభినందించడానికి వెళ్లితే, అలసట అనేదేమీ లేక అప్పుడే వికసించిన గులాబీ పూవులాగ కనిపించింది. గొప్ప భవిష్యత్తుకు ఇదొక సల్లక్షణం. రచనను ఆశీర్వదించడానికి జరిగిన సమావేశానికి అధ్యక్షత వహించిన డాక్టర్ సి నారాయణరెడ్డి రచనను ఆశీర్వదిస్తూ తొమ్మిదో ఏటనే పరిణతి చూపిందని, తలిదండ్రులు తమను తమ సంతానం నీడలో చూచుకొని మురిసిపోతారని, రచన తప్పటడుగులు వేయక మెప్పటడుగులువేసి అందరినీ మురిపించిందని అన్నారు. ముఖ్య అతిథి డాక్టర్ అక్కినేని నాగేశ్వరరావు తమ ప్రసంగంలో "నేను చలనచిత్రం దృష్టిలో చూస్తాను అన్నిటినీ రచన హీరోయిన్‌గా పనికివస్తుంది ఉత్తరోత్తరాన నా వయస్సు 60 అయినా, మనసు 20లో వుంది ఈ అమ్మాయి పెద్దదయితే ఈమెతోను నా 80వ ఏట హీరోగా వేషం వేద్దామను ది. పిల్లలు తప్పులు చేయాలి. ఈ పిల్ల పెద్దదయితే పెద్దల ప్రాణాలు తీస్తుంది (నటనలో)" అన్నారు. సుప్రసిద్ధ రంగస్థల నటుడు, దర్శకుడు, ప్రయోక్త శ్రీ ఎ ఆర్. కృష్ణ "పిల్లల ప్రోగ్రాం అనుకున్నాను. ఇంత గొప్ప నృత్యమనుకోలేదు. నా గే శ్వ ర రా వు గా రి ది పూర్తిగా స్వార్థం. నేనూ స్వార్థపరుణ్ణే ఈ రంగస్థల నృత్యంలోనే గొప్పదికావాలని కోరుకుంటున్నాను" అన్నారు. కళలు లేకపోతే దేశం వుండదని ఆయన అన్నారు. గవర్నమెంట్ చీఫ్‌విప్ శ్రీ మేటినేని కిషన్‌రావు ప్రసంగిస్తూ, "తెలుగుదేశం" ప్రభుత్వం కళలకు తగిన ప్రోత్సాహమిస్తుందని హామీ ఇచ్చారు. శ్రీ సుబ్బరామి రెడ్డి నర్తకిని ఆశీర్వదించారు. పిదప రచన తమ గురువైన శ్రీ పసుమర్తి రామలింగశాస్త్రిని సన్మానించింది.



"భామనే సత్యభామనే"
నర్తకి కుమారి బండారం రచన

## ఉరుదూవారి బెదిరింపు !

మనరాష్ట్రంలో ఉరుదూమాట్లాడేవారి సంఖ్య దాదాపు 15శాతం వుంది. ఉరుదూకుతగినస్థానమూ వుంది. మైనారిటీలకు, వారి భాషకు తగిన రక్షణ వుంటుందని ప్రతి ముఖ్యమంత్రీ హామీ ఇస్తున్నారు. అయినా ఉరుదూవారికి ఎంత మాత్రమూ సంతృప్తి లేదు. ముప్పై శాతం మంది మాట్లాడుతున్నప్పుడే ఏ భాషకన్నా రెండవ అధికార భాషాస్థాయి వస్తుంది. అలాటిది ఉరుదూకు అధికారభాషాస్థాయి ఎలా వస్తుందో అర్థం కావడంలేదు. ఉరుదూ అధికార భాషగా వున్నప్పుడు హైదరాబాద్ రాష్ట్రంలో ఇతర స్థానిక భాషల స్థాయి ఎలా వుండేదో తెలిసినవారు చాలమంది బతికేవున్నారు. అధికార భాషపై ఉరుదూవారి అభిప్రాయాలు తెలుసుకొనడానికి ఆంధ్రప్రదేశ్ ఓరియంటల్ గ్రాజు ఏట్స్ అసోసియేషన్ ఏప్రిల్ 3న నాంపల్లి స్టేషన్ రోడ్డులోని హెన్రీ మార్టిన్ ఇన్‌స్టిట్యూట్ హాలులో ఉదయం జరిపిన సమావేశంలో శ్రీయుతులు జ్వాలాముఖి,

దిన
ఆంధ్రపత్రికలో
త్రి
క

★ మన సినిమాలు
★ దినవారఫలాలు
★ ఇది వారి దృక్పథం

★ డాక్టరు కబుర్లు
★ పల్లెసీమ
★ యుద్ధకాండ

★ కలైడోస్కోపు కార్టూన్
★ శ్రీకృష్ణభాగవతం
★ వింతయథార్థం

★ ఇంకా — వ్యాసాలు, గేయాలు, కార్టూన్లు ....

ఎప్పటికప్పుడు ఆంధ్రపత్రికలో సరికొత్త ఆకర్షణలు ప్రవేశపెడుతూనే ఉంటాము.

వెంటనే ఆంధ్రపత్రిక చందాదారుగా చేరండి !

* * *

నిడదవోలు సుందరేశ్వరరావు, తిరుమల రామచంద్ర, డాక్టర్ కె.ఎల్.ఎన్. శర్మ, ఎస్.బి. రామానుజాచారి, కె.ఆర్.కె. మోహన్, నుసరత్ మొహిదీన్ ప్రసంగించారు. ఉరుదూకు తగిన రక్షణ ఉందని శ్రీ తిరుమల రామచంద్ర, శ్రీ నిడదవోలు సుందరేశ్వరరావు, శ్రీ జ్వాలాముఖి ప్రసంగించారు. సాయంకాలం జరిగిన సమావేశంలో శ్రీయుతులు మీర్ అక్బర్ అలీఖాన్ మనోహర్‌రాజ్ సక్సేనా, చంద్రశ్రీ వాస్తవ (ఉరుదూ అకాడెమీ డైరెక్టరు), ప్రొఫెసర్ గులాం బమర్‌ఖాన్ (ఉస్మానియా విశ్వవిద్యాలయం ఉరుదూ శాఖ అధ్యక్షులు), అయిజాజ్ కురేషీ మున్నగువారు ప్రసంగించారు. ఉరుదూకు అధికార భాషాస్థాయి కావాలని, అది లేకపోతే ఉరుదూవారు గొప్ప ఉద్యమానికి పూనుకుంటారని శ్రీ చంద్రశ్రీ వాస్తవ అన్నారు. ఆ మేరకు ఒక తీర్మానం ఆమోదించారు. ప్రారంభంలో శ్రీ నజీర్ అహమద్ (సంస్థ అధ్యక్షుడు) స్వాగతం చెప్పారు.

# హైదరాబాద్ నోట్‌బుక్

## డాక్టర్ భీమ్‌సేన్ నిర్మల్‌కు సన్మానం :

నగరంలోని హిందీ ప్రతిష్ఠాన్ ఏటా తన వార్షికోత్సవంలో దక్షిణ భారత హిందీ రచయితలను సన్మానించే సంప్రదాయం పెట్టుకొంది. ఈ సంవత్సరం ఐదవ వార్షికోత్సవం సందర్భంగా నలుగురు దక్షిణ భారత హిందీ రచయితలను ఏప్రిల్ 2వ తేదీ సాయంకాలం సన్మానించింది. సన్మానితులు వీరు :— డాక్టర్ భీమ్‌సేన్ నిర్మల్ (అనువాదం), డాక్టర్ ఎఫ్. వసంత (కవిత — మద్రాసు), శ్రీ జి. జె. హరిదీప్ (నాటకం — బెంగుళూరు), డాక్టర్ అరిగెపూడి రమేశ్ చౌదరి (నవల—మద్రాసు); డాక్టర్ భీమ్‌సేన్ నిర్మల్ ఉస్మానియా విశ్వవిద్యాలయం హిందీ శాఖలో రీడరు; దాదాపు పాతిక సంవత్సరాలుగా తెలుగు సాహిత్య సౌరభాలను హిందీ వారికి, హిందీ సాహిత్య సౌరభాలను తెలుగు వారికి అందిస్తున్న సాహిత్య తపోధనులు. రంగనాథ రామాయణం మున్నగు మహాకావ్యాలను అనువదించారు. పోతన భాగవతాన్ని శ్రీ శివరామశర్మ, డాక్టర్ నీరజా చక్రవర్తి మున్నగువారితో పాటు అనువదించారు. అది ముద్రణలో వుంది. కవిత్రయ భారతాన్ని అనువదిస్తున్నారు. పురుషోత్తమ కవి హిందీ నాటకాలను వెలుగులోకి తెచ్చారు. ఉత్తర భారతంలోని వివిధ విద్యాసంస్థలలో సన్మానాలు, బిరుదులు పొందారు. గాంధీభవన్ ప్రకాశం హాలులో జరిగిన ఈ వార్షికోత్సవంలో కేంద్ర న్యాయశాఖా మంత్రి శ్రీ శివశంకర్ సన్మానితులకు మెమెంటోలు, వేయిన్నూటపదార్లు అందజేశారు. ఈ సందర్భంలో శ్రీ శివశంకర్ ప్రసంగిస్తూ ఇలా అన్నారు :— భాషకు వారసత్వం లేదు. అది ఆర్జిత సంపత్తి. దక్షిణాది వారు హిందీ నేర్చుకొని, ఉత్తరాది వారికంటే మిన్నగా రచనా వ్యాసంగం జేసి, పేరు ప్రఖ్యాతులు సంపాదించుకోగలరు. భాష రాజకీయాలకు అతీతమైంది. జాతీయభాషా ప్రచారానికి అందరూ పాటుపడాలి. హిందీ ప్రతిష్ఠాన్ అధ్యక్షులు; మాజీ మంత్రి శ్రీ హయగ్రీవాచారి తమ ప్రసంగంలో దక్షిణ భారత దేశంలో హిందీ ప్రచారానికి తాము చేస్తున్న కృషిని వివరించి, చేయవలసిందే చాల వుందని, దానికి కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు సహకరించాలని కోరారు. రాష్ట్ర రెవెన్యూశాఖ మంత్రి శ్రీ మహేంద్రనాథ్ ప్రసంగిస్తూ, రాష్ట్ర ప్రభుత్వం హిందీకి తగిన ప్రోత్సాహం, ఆర్థికసహాయం చేయగలదన్నారు. ఈ వార్షికోత్సవంలో సుప్రసిద్ధ హిందీ రచయితలు బాబూ గంగాశరణ్ సిన్హా, శ్రీ సుధాకర్‌పాండేలను కూడ సన్మానించారు. హిందీ ప్రతిష్ఠాన్ కార్యదర్శి శ్రీ కాటం లక్ష్మీనారాయణ ప్రారంభంలో స్వాగతం చెప్పారు. చివరన ధన్యవాదాలు సమర్పించారు. సన్మానితులూ ప్రసంగించి వుంటే బాగుండేది.

**ఉపశ్రుతి :**

“ఏంసార్, ముఖ్యమంత్రి నిరంకుశులు. అధికారాలన్నీ తమ చేతిలోనే పెట్టుకున్నారు. ప్రభుత్వంలో ఏం జరిగేదీ తోటి మంత్రులకే తెలీదు అంటున్నారే ప్రతిపక్షాలవారు. మీరేమంటారు ?” అనడిగారు ఒకరు నన్ను. “పూర్వపు మంత్రులయితేఎక్కడబడితే అక్కడ, ఏదిబడితే అది ప్రకటించేవారు. ఇప్పటి మంత్రివర్గం కలిసికట్టుగా క్రమశిక్షణతో మెలుగుతూవుంది. పెదవి కదపడంలేదు. ఏ విషయాలూ పొక్కడంలేదు. అదే యాతన ప్రతిపక్షాలకు. ఈ విధంగా ఎత్తిపొడిస్తేనన్నా ఏవైనా మాటలు రాల్తాయేమోనని ఆశ పాపం!” అన్నారు నా మిత్రులొకరు సమాధానంగా.

— తిరుమల రామచంద్ర *








Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3

Editor : S Radhakrishna.

# క్లియర్-టోన్

## వాడి సంతృప్తి చెందిన వాళ్లు, దాని గురించి ఏమంటున్నారో వినండి.

"నా వంటి ఛాయ ఎంతో మెరుగు పడిందని అంది మా వదిన. ఆమె నుంచి అటువంటి ప్రశంస రావడం నిజంగా గొప్పే!"
—డైసీ నామ్‌దార్
రంగస్థల నటి





"నాలుగు వారాలుగా నేను క్లియర్-టోన్ వాడుతున్నాను. నా మచ్చలు దాదాపుగా పోయాయి."
—శీరీనాజ్ పటేల్
విద్యార్థి

"నా పని వల్ల నేను ఎండలో తిరగాల్సి వస్తూంటుంది. కాని ఈ మధ్య నేను నల్లబడటం లేదని గ్రహించాను. అది క్లియర్-టోన్ మహత్యం మరి."
—పౌలెట్ సల్డానా
మార్కెట్ రిసెర్చర్





"క్లియర్-టోన్ నా చర్మాన్ని మరింత మృదువుగా చేసింది— నా మోచేతుల్ని కూడా!"
—రాజం రాజామణి
గృహిణి

## వంటిఛాయ మెరుగుపరిచే తిరుగులేని క్రీమ్

ఇవి. క్లియర్-టోన్ వాడి ప్రయోజనం పొందిన వేలాదిమందిలో కేవలం నలుగురి అభిప్రాయాలు మాత్రమే. క్రీములు, లోషన్‌లు మూలికా ఔషధాలు మొదలైన వెన్నో వాడి చూశారు వాళ్లు. కాని ఏదీ పని చెయ్యలేదు. తర్వాత వాళ్లు కనుక్కున్నది క్లియర్-టోన్ వంటి ఛాయని మెరుగుపరిచే తిరుగులేని క్రీమ్.

క్లియర్-టోన్ క్రీమ్ అంతర్జాతీయ ఔషధ పరిశోధనా ఫలితం. దీన్ని అందిస్తున్నవారు నికొలాస్ లాబరేటరీస్ ఇండియా లిమిటెడ్. క్లియర్-టోన్ శాస్త్రీయంగా సూత్రీకరించబడినది. భారతదేశంలో దొరికే మరే ఇతర క్రీములలోనూ లేని వంటిఛాయ - మెరుగుపరిచే ఒక ప్రత్యేక పదార్థం దీనిలో ఉంది.

క్లియర్-టోన్ మీ చర్మం మీద సహజమైన రీతిలో పనిచేసి, కొన్ని వారాల్లోనే దాని ఛాయని మెరుగు పరుస్తుంది. మచ్చల్ని, మరకల్ని పోగొడుతుంది. మీ వంటి ఛాయని ఆరోగ్యంగా మెరిపిస్తుంది.

అన్నిటికంటె ముఖ్యంగా, క్లియర్-టోన్‌లోనే వుండే శేమనిచ్చే ఒక ప్రత్యేక పదార్థం, మీ చర్మాన్ని అన్ని కాలాల్లోనూ నున్నగా, కోమలంగా ఉంచుతుంది— ఎండగా వున్నా, చలిగా వున్నా లేదా పొడిగా వున్నా, వర్షంగా ఉన్నా.

ఈ రోజునుంచే మార్పుండిక— ఇకమీదట క్లియర్-టోన్ వాడటం ప్రారంభించండి. మచ్చలేని మెరుగైన వంటిఛాయకోసం, అది అలాగే నిలిచి ఉండటం కోసం. ఎందుకంటే, ఎండలోని నల్లబరిచే అల్ట్రావయొలెట్ కిరణాలనుంచి కూడా మీ చర్మానికి రక్షణ ఇస్తుంది క్లియర్-టోన్

ప్రపంచమంతటా గల లక్షలాది అందమైన వ్యక్తులు ఇచ్చే సలహా పాటించండి. రోజూ వాడండి క్లియర్-టోన్.

అంతర్జాతీయంగా పేరు పొందినది.






మెరుగైన ఫార్ములా
తిరుగులేని ఫలితం

మెరుగైన వంటిఛాయలోని రహస్యం—సహజమైన రీతిలో

క్లియర్-టోన్
లండన్ • పారిస్ • న్యూయార్క్

daCunha-NICL/26/82-TL